# శ్రీకృష్ణుడు చూపిన మార్గము

శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారిగారు

తమిళమున రచించినదానికి తెలుగు అనువాదము



ప్రకాశకులు:

హిందూసమాజము

రాజమహేంద్రవరము

1940



[వెల 0—12—0

# తొలిపలుకు.

---

ఒకభాషనుండి మరియొక భాషలోనికి అనువదించుట కష్టమైనపని. తమిళమునకును తెనుగునకును దగ్గరయేమైనను నీరెంటికిని పలుకుబడిలో ఎన్నో భేదములున్నవి. తెనుగునకు సంస్కృతపదముల సాహాయ్య మెక్కువగా కావలెను. తమిళమునకంతగా నక్కరలేదు. తమిళములో నొక యభిప్రాయమును చాలమాటలతో కొంచెము దీర్ఘముగా చెప్పవలెను. తమిళపదములకు సరియైన అచ్చతెనుగుపదములు సాధారణముగా నుండుచునేయున్నను, వానిలో కొన్ని వ్యవహారభ్రష్టములై సర్వజనసుబోధకములు కాకపోవచ్చును. అప్పుడనువాదకుడు తెనుగు వ్యవహారమునగల వేరుపదములనే యుపయోగింపవలసియుండును.

ఒక గ్రంథమును స్వతంత్రముగ రచించుట సులభము. మరియొకభాషనుండి యనువదింపవలసివచ్చినప్పుడనువాదకుడు రెండువిధములయిన భయములకు లోనగును. మొదటిది మూలగ్రంథకర్త యభిప్రాయమునకు భంగము కలుగునేమోయను భయము. రెండవది మూలమునున్నదున్నట్లుగా, ముక్కకుముక్కగా భాషాంతరీకరించినయెడల అనువాదితగ్రంథమంత సుబోధకముకాదేమో యనుభయము.

కాంగ్రెసుప్రభుత్వములో ప్రధానమంత్రిపర్యమైన శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారు తమిళ భాషాపండితులు. తాము వ్రాసిన విషయమును, ఆవిషయమును దెలుపుటకు వలయుభాషను సంపూర్ణముగ గ్రహించి వ్రాయగల యసాధారణశక్తి కలవారు. ఇదిగాక, తాము వ్రాయబోవు విషయమునుగురించి సంపూర్ణానుభవము లేక, ఆయభిప్రాయమును తమజీవితము ననుసంధించి యాచరింపక గ్రంథరచన చేయరు. గీతాతత్త్వమును బాగుగా నవగాహన చేసికొని యాచరించు కర్మవీరులు. గీతాసారము సామాన్యజనులకు కూడ బోధపడున ట్లీగ్రంథమును బహు బుద్ధికుశలతతో రచించిరి.

ఇట్టి మహనీయులు వ్రాసిన గ్రంథము తెనుగులో లేకుండుట గొప్ప లోపమని గ్రహించి శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు, డాక్టర్ చిలుకూరి నారాయణరావు ఎమ్.ఏ., పి.హెచ్.డి.,గారిని "కణ్ణన్ కాట్టియవట్టి" "కృష్ణుడు చూపిన మార్గము" అను నీగ్రంథమును తెనిగింపవలసినదని కోరగా వారు సంతోషముతో నంగీకరించిరి. వారు శ్రద్ధతోను, భక్తితోను, సర్వజనసుబోధము కావలెన నుద్దేశముతోను అనువాదించినారు. పండిత చిలకమర్తి లక్ష్మీనృసింహకవిగారు దీనిని సరిచూచినారు. వీరుభయులకును, తమిళ గ్రంథమును తెలుగున ప్రచురించుటకు అనుమతి ఒసంగిన

శ్రీమాన్ రాజగోపాలాచారిగారికిని మా కృతజ్ఞతాపూర్వక వందనములు సమర్పించుచున్నాము.

ఇందలి అర్ధానుస్వార శకటరేఫలు లాభములేదని యెంచి ప్రకాశకులు వానిని మానివేసినారు. మరియు ద్రుతము మీద గ, జ, డ, ద, బ, లు ఉపయోగించకుండ అసలుపదముల స్వరూపము సాధ్యమైనంతవరకు ఉంచడమైనది.

1—5—1940,
రాజమహేంద్రవరము. } హిందూసమాజము.

# విషయసూచిక.



---

26406
29.2.72

# భారతకథ, గీత.

భగవద్గీత మహాభారతములో నొకభాగము. యుద్ధమారంభింపబోవు సమయమున నిరుపక్షములందును పోరికి సన్నద్ధులై నిలిచిన సేనలను చూతమని, తన రథమును సేనల మధ్యకు కొనిపొమ్మని యర్జునుడు సారథియైన శ్రీకృష్ణునితో చెప్పెను. అప్పుడు బంధువులును, స్నేహితులును నొకరినొకరు చంప నాయుధపాణులై నిలుచుటజూచి యతడు మనసున కలగి "ఇదేమిపని? రాజ్యమేల? పగయేల? చుట్టములను చంపి సంపాదించు రాజ్యాధికారభోగమువలన నేమిసుఖము?" అని పలికి, వింటిని క్రిందికి విడిచి, చదికిలబడి కూర్చుండెను. ఈసందర్భమున నతనికి సారథియై యుండిన కృష్ణభగవానుడు గురువై నిలిచి యుపదేశించిన మాటలే భగవద్గీత యనునది.

ఇట్లర్జునుడు, "యుద్ధమెందుకు? నేను యుద్ధము చేయను" అని చెప్పినప్పుడు "యుద్ధముచేయుటయే నీవిధి" అని యుపదేశము చేయుచు వివరించిన యీ మార్గమునెల్ల హిందువులును సంప్రదాయవ్యత్యాసము లేక వేదమువలెను, ఉపనిషత్తులవలెను, నొప్పుకొను నొకశాస్త్రమై యనేక సహస్రవర్షములనుండియు నంగీకరింపబడి వచ్చుచున్నది.

మహాభారతకథలో ఒక భాగమై యమరియున్నను, భగవద్గీత ప్రత్యేకశ్రేష్ఠతను బొందిన యోగశాస్త్రమై యొప్పి వెలుగుచున్నది. ఉపనిషత్తులతో నిదియునొక యుపనిషత్తుగా మతాచార్యులచేత తలంపబడుచు వచ్చుచున్నది. గీతాశాస్త్రములోని యుపోద్ఘాతమే ముఖ్యమని యెంచి దానిననుసరించియే తరువాతి యుపదేశములు చేయబడినవని తలచుట సరికాదు. యుద్ధము ఆగిపోకుండ తుదవరకు సాగింపవలెనను తలపుతో గీతయందలి ఉపదేశములు చేయబడినవని అనుకొన్నపక్షమున దాని తత్త్వము మనకు సరిగా బోధపడదు.

గీతను చదువబోవుచు ప్రస్తావనను మరచి విడుచుటయే మంచిదని నాయభిప్రాయము. గీతలో చెప్పబడిన తత్త్వములును, ఉపదేశములును యేకాలమునకైనను యే సందర్భమునకైనను తగి యుండును. అయినను దృష్టాంతముగా తీసికొనిన యొక సందర్భములోని విషయములనే ప్రమాణముగా చేసి సామాన్యమగు ధర్మశాస్త్రమును ప్రతిపాదించుట క్రమమైనది కాదు. యుద్ధములో అర్జునునకేర్పడిన మనసు కలతకును, సందేహములకును తగిన మందు గీతావాక్యములందు కనబడుననుటలో సందేహము లేదు. అయినను ఏదో అభిప్రాయము మనస్సులో పెట్టుకొని గీత ప్రసిద్ధికెక్కిన ధర్మశాస్త్రము కాదనుట యుక్తముకాదు.

# గీతామాహాత్మ్యము.

హిందూసంఘములో చేరిన సర్వసంప్రదాయము లకు చెందినవారును శాస్త్రముగాను ప్రమాణముగాను నొప్పుకొన్న భగవద్గీతలో కొన్నిశ్లోకములయినను శ్రద్ధా భక్తులతో కూడిన చింతనచేసి పఠించినయెడల మన పురాతనులు చూచిన సత్యములను, ఋషులు స్థాపించిన హిందూధర్మము నిట్టివని తెలియగలవు. హిందూధర్మ మను పునాదిపైననే మన సకలనాగరికతయు, కళలును, లక్ష్యములును, ఇండియాలో మనము గౌరవమునభివృద్ధిచేయు ఎల్లభాగ్యములును, మేడలుగా నిలిచియున్నవి. ఆహిందూ ధర్మము తెలిసికొనుట మనకు ముఖ్యవిధియై యున్నది. కాబట్టి సనాతనమార్గాభివృద్ధికి ప్రయత్నింపగోరువారు గీతా సారాంశమును బాగుగా చదివి తెలిసికొనుటవలన మేలు చేకూరును. భగవద్గీత 18 అధ్యాయములుగా భాగింపబడిన 700 శ్లోకములు గల గ్రంథము. వీనినుండి 226 శ్లోకముల నెత్తి యర్థమును చెప్పవలెనని యుద్దేశించితిని. ఈ 226 శ్లోకముల లోని అర్థమును బాగుగా గ్రహించుకొన్నయెడల భగవద్గీత లోని సారమును సంపూర్ణముగా గ్రహించుకొన్నట్లే యెంచు కొనవచ్చును.

# అల్పజ్ఞానపు భ్రమ

భౌతికశాస్త్రవిషయములు కొంచెము తెలియుటతోడనే కొందరికి భ్రమ కలుగును. దానిలోను మరికొందరు చేసిన శోధనఫలముగా, గుజిలీఅంగడిలో తక్కువవెలకు ప్రాతసామానులవలె, శ్రమలేకయే సంపాదించిన జ్ఞానము కొందరి కధికబోధ నిచ్చునదిగా నుండును. ఏది చిన్నది, ఏది పెద్దది, ఏది దగ్గరగా నుండును, ఏది దూరము అను నిదానబుద్ధి తగ్గిపోవును. ఏది తమకు తెలియకుండునో యది లేనేలేదని సాధించుకొందురు. మనుష్యుని జ్ఞానమున కందని దంతయు నసత్యమని త్రోసిపుచ్చుటకు జనులు ముందంజ వేయుదురు. శాస్త్రమనియు, ధర్మమనియు, నంతయు, మోసగాండ్రు వ్రాసియుంచినారని చెప్పుదురు; ఇవన్నియు పామరజనులను మోసగించుటకే మూఢులచేత వ్రాయబడినవనియు సాధింతురు. కాని ప్రకృతిశాస్త్రములను పరిశోధించి ప్రకృత్యవస్థలను చూచి గ్రహించుటకు తమ ఆయుష్కాలమంతయు తమ శక్తినంతయును ధారపోసినవారు ఇట్టి యున్మత్తతకు లోను కారు. ప్రకృతిశాస్త్ర పరిశోధకులు పలువురు గొప్ప వినయము గలిగినవారుగా నున్నారు. తాము కనిపెట్టినవి చాల నెక్కువగ నున్నను,

కానని దానిలో, తాము కాంచినది చాలకొంచెమే యని తెలిసికొనుచున్నారు. కాలక్రమమున నింకను పలువిషయముల పరిశోధించి, భౌతికశాస్త్రముల నభివృద్ధిచేయవచ్చును గాని, మనుష్యుని జ్ఞానమున కందిన విజ్ఞానమున్నను దానికి మించినదైన విషయముండనేయున్నదని వారు తెలిసికొని యున్నారు. భౌతికశాస్త్రములను బాగుగా శోధించి పరీక్షచేసినవారు వినయమును విడువలేరు. తాము సంపాదించిన యధికజ్ఞానముచేతనే యధికమగు నడకువతో నున్నారు. విజ్ఞానపరిశోధన కతీతమయిన తత్త్వమున్నదని యొప్పకొని యా పరతత్త్వమునం దడకువ కలిగి తలవంచి యున్నారు.

## (4)

## పరతత్త్వ విచారము

కారణములకెల్ల కారణమైనిలిచిన మొదటి కారణము, ప్రకృతివిధులకెల్ల విధియై నిలిచిన పరశక్తి, మనుష్యుని బుద్ధి విచారమునకు లోబడదు. అయినను ఎంతటి విషయమును, ఎంతటి తత్త్వమును నరసి తెలిసికొనవచ్చునని దానికి తోచును. ఈ తలంపు దానిస్వభావములోనే యున్నది. ఇది స్వభావమైనను సత్యము వేరు. మానవుని బుద్ధి నిర్మాణము గొప్పదేయైనను నది దేనియందు భాగమై యున్నదో యా

సంపూర్ణతత్త్వమును తనలో నడగింప సాధ్యముకాదు. ఎంత యడగింపనెంచినను, అది లోపల నిముడదు. ఒక రాతిపై నిలిచియున్నవాడు తాను దానిపై నిలిచియుండియే దానిని ఎత్తివేయుచాలడు. మహాబలవంతుడైనను నేది తాను నిలుచుకొనుటకాధారముగ నున్నదో దానిని తీసివేయ సాధ్యము కాదుగదా? దానిని విడిచి క్రిందికి దిగినవాడు దానిని తీయజాలును. బండినిలాగు గుఱ్ఱమును బండిలో నెక్కించిన నది బండిని లాగకలదా? మనుష్యునిబుద్ధి పరతత్త్వమును విడిచి, ప్రత్యేకముగా నిలుచు స్వభావము కలది కాదు. కావున, నాపరతత్త్వమునే వేరుచేసి తాను ముందుకు పోజాలదు; అనగా, దానిని తన జ్ఞానముయొక్క హద్దులో నిముడ్చ చాలదు. కడుపులోని జీర్ణకోశమెట్టి యాహారమునైనను జీర్ణము చేయగలదు. కాని, తన్నుదానే జీర్ణించుకొను స్వభావము దానికి లేదు. ఒకసోలను తీసికొందము. దానిలో నెంత పట్టునో అంతయే యది గ్రహింపగలదు. ఒక పామున కెంతటి ఘోరమైన యాకలివేసినను తనతోకనే తాను తిని వేయచాలదు. ఆవిధముగనే యంతటికిని కారణమైన పరతత్త్వము మానవుని బుద్ధియందడగి యుండదు.

# విచారక్రమము.

విజ్ఞాన పరిశోధనమున అన్ని విషయములందునొక హద్దు కాన్పించును. ఏవిషయము నెత్తుకొని శోధించినను నొక మితికి మించి దానితత్త్వమును దెలియ సాధ్యముకాదు. త్రవ్వుచున్న నూతిలో బండ కనబడినయెడల త్రవ్వుటను నిలుపవలసివచ్చినట్లు, ఎట్టి పరిశోధనమందును, ఒక మితినిమీరి మనుష్యునిబుద్ధికతీతమయిన విషయముపై పోజాలదు. అదియే పరిశోధనకు సరిహద్దు. వేదాంతమునందు మాత్రమే కాదు. పదార్థశాస్త్ర పరిశోధనమందును గణితశాస్త్రమందును ఈ హద్దు అక్కడక్కడ నేర్పడినది. మనము కనుగొనినదానికిని, కనుగొనవీలగుదానికిని పాలమీది మీగడకును పాలకును గల యంతరమున్నది. మీగడక్రిందనున్న పాలలో తెలియరాని రహస్యమున్నది. ఇట్లు సాధారణవ్యవచ్ఛేద, పరిచ్ఛేదశోధనల కగ్గముకాని రహస్యమును, వేదము ఉపనిషత్తులు గీత మొదలయిన గ్రంథములును, ధర్మసూత్రములును, మునివరుల వచనములును, జీవనచరిత్రములును వివరించుచున్నవి. పంచేంద్రియములను మూలముగా గొని, పంచేంద్రియవిషయములమూలమున తెలిసికొనిన తత్త్వములనే ప్రమాణముగా చేసికొని, వాని ననుసరించి యూహచేసి తెలిసికొనదగిన

వస్తువులు భౌతికశాస్త్రవిషయములు. వీనికి మించిన విషయములనెట్లుకొననగును, ఎట్లుకొన్పింపనగును, అనునదే లోకమున ననేకదేశములలోనున్న మతములయాశయమును ప్రయత్నమును నగుచున్నది. అందుచేతనే మతగ్రంథములందు జెప్పబడు విషయములు భౌతికశాస్త్రములలో చెప్పబడు స్పష్టములైన హేతువులవలెను పరిశోధనలవలెను నుండవు. కేవలము ప్రత్యక్షప్రమాణముచేతనో, యుక్తిబుద్ధిచేతనో తెలియవీలులేని యీవిషయమును పరిశోధన చేయుటకు భక్తి కావలెను, ధ్యానము కావలెను, శాంతి కావలెను, నియమము కావలెను, తపస్సుకావలెను, అనియిట్లు వేదమునందును, తక్కిన ధర్మసూత్రములందును చెప్పబడియున్నది. ప్రక్కనున్న యూరికి కాలినడకను పోయి చేరగలము. దూరముననున్న యూరికి బండియు నెద్దును కట్టుకొని చేరవచ్చును. చెట్టుపై కెక్కుట వేరు, నూతిలోనికి దిగుట వేరు. పుష్పమును చెవిలో పెట్టిన యెడల వాసన దెలియదు. అందమైనపటమును ముక్కులో నుంచిన అందము తెలియదు. ఇంద్రియములకు లోబడని యొకవస్తువును మనసులో కనబడజేయుట ఇంద్రియానుభవముపై నిలిచిన పరిశోధనలమూలముసను ప్రమాణముల మూలముసను సాధ్యముకాని కార్యము. అందుచేత పారమార్థికవిషయములను పరిశోధించి చేయుటకు భక్తియు, నియమమును, మనశ్శుద్ధియు, ధ్యానమును, భగవద్వందన

మును, తపస్సను కావలెను. తపస్సనగా బాహ్యకరణము లను, నంతఃకరణములను స్వాధీనముచేసి మనస్సు నేకాగ్రముగ నిలుపుట. శరీరమును కష్టపెట్టుట కాదు.

## 6

## ఏల గమనింపవలెను?

"అంతయు సరియే కాని బుద్ధికగోచరమయిన యిట్టి తత్త్వమును మానవు డేల గమనింపవలెను? తెలియరాని విషయమును గూర్చి చింతించియు పరిశోధించియు నేమి ఫలము?" అను ప్రశ్న యుదయించును. దీనికి సమాధాన మేమనగా :— భౌతికశాస్త్రవిచారమునకు గురికానిదయి నంతమాత్రమున, నుండవలసినవస్తు వుండకపోదు. మనము తాకి, కని, మూచూచి, విని, ఆలోచించి, గ్రహించిన విష యములకు పైగా నంతటికి నాధారమైన మొదలికారణము ఒకటున్నదనుట నిశ్చయము. దానిని తాక వీలులేదు; దాని రూపమును తెలియ వీలులేదు; దాని గుణములు బుద్ధికి గురికావు. అయినను నది యెల్లెడల అన్ని విష యములందును కలిసి నిలిచియుండును. సకలపదార్థములును సకలశక్తులును మనుష్యుని స్వరూపమునందుండును. అంతయు నీయరయరాని వస్తువుచే నావరింపబడియుండుట నిజము.

ఇట్టి యొక గొప్పతత్త్వమును గమనింపక యెట్లుండవచ్చును? కావున నాపరవస్తువును గమనింపక విడుచుటకు వీలులేదు. చీకటిగదియందు ఫలానిదియున్నదని తెలియ వీలులేదుగదా! అయినను దానిలో నొక ముఖ్యమయిన వస్తువు రూఢిగా నున్నదని తెలిసియున్నయెడల నాచీకటిగదిని గమనింపక విడువవచ్చునా?

గణితశాస్త్రజ్ఞులను ప్రశ్నించినయెడల ననేకవిషయము లలో గణితఫలములను లెక్కవేసి చూపుటకు సాధ్యము కాదని చెప్పెదరు. అయినను ముఖ్యములగు ననేకవిషయము లను గణితముచేయుచు వచ్చుచున్నారు. అట్టి గణితమునాధా రముగాగొని కట్టడములనుకట్టియు, యంత్రములను చేయుచు న్నారు. వృత్తముచుట్టుకొలతకును, దానిమధ్యరేఖకొలతకును గల పరస్పరసంబంధ మేమి? ఒక సమచతుష్కపు భుజమున కును దానికర్ణమునకునుగల పరస్పరసంబంధ మేమి? అనిననిట్టి సాధారణవిషయములను గూడ గణితముచేసి సంఖ్యారూప ముగ తెలియ జేయుటకును వీలులేదు. నాలుగునకు వర్గ మూలము రెండు, తొమ్మిదికి వర్గమూలము మూడు, అనిచెప్పి నట్లు, రెంటికివర్గమూలమేమనియడిగినయెడల దశాంశములలో నైనను, సాధారణ భిన్నములోనైనను సరిగా గణితముచేసి చెప్పవీలులేదు. అయినను నీ తెలియరాని లెక్కలమేర నతిక్ర మించి గణితశాస్త్రజ్ఞులు కట్టడములు, పెద్దవంతెనలు, ఆన

కట్టలు మొదలైనవానిని కట్టుటకు నిపుణులగుచున్నారు. అదేవిధముగా దైవము, ధర్మము అనునవి పరిశోధనకులొంగవను కారణమునుబట్టి వానినిగూర్చి విచారింపక విడిచిపెట్టుట సరికాదు. వేదము, ఉపనిషత్తులు, గీత మొదలైన గ్రంథములందు చెప్పబడిన విషయముల మితి, ఆధారము, రూపము మొదలగువానిని నిరూపించి, నిశ్చయింప వీలులేకున్నను నవి చాలముఖ్యములైన విషయములు; జీవితమునకు మిగుల నావశ్యకములు.

గణితము, భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము మొదలైన విజ్ఞానశాస్త్రముల ప్రథమాధ్యాయములో నెట్టి స్పష్టములగు భావములు తెలుపబడియున్నవో యంత స్పష్టముగా గీతయందును, నుపనిషత్తులందును గూడ తెలుపబడియుండలేదని యివి యాధార రహితములగు గ్రంథములని యెంచగూడదు. ఇంద్రియాతీతములగు అధ్యాత్మవిషయములను విచారించి, జ్ఞానమును సంపాదించుటకు మన తెలివియు, బుద్ధియు మాత్రము చాలవు. వీనికి జోడుగ భక్తి, మనశ్శుద్ధి, తపస్సు, ధ్యానములును నావశ్యకములు. ధ్యానమును, తపస్సును గలవారికీగ్రంథము దారి చూపించును.

కాయశుద్ధితోడను, మనశ్శుద్ధితోడను ధ్యానించి పరమాత్మను ప్రార్థించినయెడల, ప్రథమమున విపరీతముగను పరస్పరవిరోధములుగను, అర్థరహితములగు పదములుగను

ఆలోచినవికూడ, తరువాత అర్థసహితములై కాన్పించును. మన స్సునకు గురియైనవిషయము ప్రకాశముపొంది ప్రజ్వలించును. ఆవిధమున భగవంతునిదయను పొంది యంతరాత్మనుండి కని యానందించు విషయము నితరులకు వ్యక్తము చేయుటకు శక్తిలేకపోయి యుండవచ్చును. కాని యట్టి యనుగ్రహ మును, ఆనందమును సత్యములే.

## 7

## శాస్త్రమును పఠించు క్రమము

ఏమతమునైనను సంప్రదాయమునైనను సరిగ తెలిసి కొనుటకు ద్వేషము, తిరస్కారము కల బుద్ధితో ప్రవర్తింప కూడదు. ఒకవిషయమును ద్వేషించిన నావిషయతత్త్వము గోచరింపదు. "మోసగాండ్రయి మనలను వంచించుటయే వీరి యుద్దేశమై యున్నది. ఏదో లాభముకొరకసత్య మును, మోసమును చేర్చి మతముల నేర్పరిచి, స్మృతు లను పురాణములను పూర్వులు వ్రాసినా" రనిపఠింప తొడగితిమేని నొకటియు తెలియదు. ఇట్లెంచుట మూఢ త్వము. మన కిప్పుడున్న జ్ఞానమును, జాగ్రతయు, సందేహ భావమును నాకాలపు జనులకును నుండెను. వారంద రును మూఢులనియు, మిక్కిలి సులభముగ వలయందు చిక్కిపోయిరనియు నెంచుట తప్పు. మనకున్న బుద్ధి, చురుకు

దనపూకాలపు జనులకు గూడ నుండెను. విషయములందు బుద్ధిని ప్రవేశింపచేసి, విచారించి, యసత్యమును మోసమును గ్రహించి తొలగించుటకు ఆనాడవకాశము లేకపోలేదు. మతములను స్థాపించిన పెద్దలను ప్రత్యక్షముగ కన్నవారును, విన్నవారును ఆమతస్థాపకులు మంచియుద్దేశముతోనే ప్రవర్తించినారని నమ్మి యాపెద్దలను గౌరవించుటచేతనే నామతములు కొనియాడబడుచు వచ్చినవి. మోసముచేతను, జనుల తెలివితక్కువచేతను యవి యభివృద్ధి బొంది నిలబడిన వని యెంచుట కేవలము తప్పు.

ఏసంస్థయైనను కాలము గడచిన కొలదిని స్వార్థపరులగు కొందరకు వశమై వారి స్వార్థమునకు సాధనమగును. అట్లే మతసంస్థలును మతములును గూడ చెడిపోయియుండుట సత్యము. కాని తరువాతి కాలమున చెడియుండుట, పూర్వముండిన మహాత్ముల నవమానించుటకు కారణముగా గొనుట మంచిపని కాదు. మురికికాలువలోని నీళ్లను చూచి మేఘములలోని నీళ్లను నట్లే యుండు ననవచ్చునా? మేఘములను వానినుండికలుగు వర్షమును నెట్లు గౌరవముతో చూడవలెనో యావిధముననే యాదిఋషులను వారు తెలిపిన ధర్మసూత్రములను గౌరవించి పఠింపవలెను. దొంగను చూచి పట్టుకొనుటకు నింటిలో శోధన చేయ

ప్రవేశించు రక్షకభటుని మనోభావముతో భగవద్గీతనుగాని యితరమతస్థులు గౌరవించు మార్గ దర్శకగ్రంథములను గాని చదువుటవలన లాభములేదు; అట్లు చదువనుకూడదు. అట్టి గ్రంథములను చదువునప్పుడు తండ్రికడకు కొడుకుపోవునట్లు భక్తి విశ్వాస యుక్తులై వానియొద్దకు పోవలెను.

# ౪

## ఆత్మ

(గీత:—అధ్యాయములు—2, 13)

జీవుడు, జీవాత్మ, ఆత్మ, దేహి అని చాల పేళ్ళతో పిలువబడు వస్తువొకటి దేహములో దేహమునకు యజమానియై వాసముచేయునను తత్త్వమును మొదట మనము తెలిసికొనవలెను. కంటికగపడు దేహముమాత్రము సత్యము, అదితప్ప మరియేదియు లేదని యెంచుట తప్పు. జీవుడింద్రియములకు గోచరింపడు; అయినను దేహములోపల నంతటను వ్యాపించి, యంతను నడిపించుచు ననుభవించుచు వచ్చుచున్నాడు. మనుష్యునికుండు బుద్ధివేరు; ఆత్మ వేరు. చైతన్యము, ఆలోచన, ఆశ మొదలగు మనోభావములు, నిదానబుద్ధి, వివేకము, ఇవి యెల్లను మనుష్యుని దేహమునకు సంబంధించిన స్వాభావికములయిన వ్యాపారములు. ఇవియే ఆత్మ కావు. వీనినెల్లను విడిచి, వానికి వెనుక నిలిచియున్నదియాత్మ.

ఆత్మ శరీరమునందంతటను వ్యాపించియున్నది. కడుపులోనో, గుండెలోనో, తలలోనో మాత్రముండునది కాదు.

దానికి వేరుగ నవయవము గాని, కోశము గాని లేదు. 'ఈథరు' లేక 'ఆకాశ' మని భౌతిక శాస్త్రజ్ఞులు కల్పించు కొనిన కల్పనాపదార్థమువలె దీనికి తూకము లేదు. నివాసము లేదు. పరిమాణము లేదు. మనుష్యునికి మాత్రమే కాక ఎల్ల ప్రాణులకును, లతా, గుల్మ, వృక్షములకును నాత్మయున్నది. దేహమనునది ఆత్మ యుండుటకు స్థలము. కావున దేహమును క్షేత్రమనియు, ఆత్మను క్షేత్రి యనియు, క్షేత్రమును చూచు వాడు క్షేత్రజ్ఞుడనియు, చెప్పుట గలదు.

మనుష్యుడో, జంతువో, స్థావరమో, మరణము నొందినప్పుడది దేహమునకు మట్టుకు సంభవించునది. దేహము పూడ్చబడును. కాల్చబడును. లేక ప్రాణుల కెర యగును. ఆత్మ చావదు. దానిని చంపుటకును వీలు లేదు. జనులు చనిపోయినారని దుఃఖించుట మూఢత్వము. చినిగి పోయిన లేక అక్కర లేని వస్త్రమును తీసివైచి, మనుష్యుడు క్రొత్తవస్త్రమును ధరించినట్లు, ఆత్మ వేరు దేహములోనికి పోయి ప్రాత దేహమును విడిచిపెట్టును. ఇదియే సత్యము. దీనికి మన మేల దుఃఖపడవలెను?

శ్రీ భగవానువాచ:

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు: ఎవరినిగూర్చి దుఃఖింప నావశ్యకతలేదో, వారినిగూర్చి దుఃఖించుచున్నావు. తెలిసిన వారివలె మాట్లాడుచున్నావు. చచ్చినవారికోసమును, ఉన్న వారికోసమును తెలిసినవారు దుఃఖపడరు. 2-11

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామస్సర్వే వయ మతఃపరమ్.

ఇంతకు ముందు నే నెన్నడును లేకుండుటలేదు. నీవును నిక్కడనున్న రాజులునెవ్వరును నట్లే. ఇకమీద నొకనాడును మనము లేకుండ బోవుటయు నుండదు. 2-12

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాన్తరప్రాప్తి ర్ధీర స్తత్ర నముహ్యతి.

ఆత్మకీదేహమున నెట్లు బాల్యము, యౌవనము, ముసలితనమును గలుగుచున్నవో, అట్లే వేరొక శరీరమును జన్మమును ఏర్పడును. కావున, దీనికి ధీరుడువిచారింపనేల? 2-13

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి.

ఈలోకములోనున్న యెల్లప్రాణుల శరీరములందును వ్యాపించి యున్న వస్తువు నాశనము కానిదని తెలిసికొనుము. దీనిని నాశనముచేయుట యెవ్వరికిని సాధ్యముకాదు. 2-17

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితావా నభూయః
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.

ఇతడు పుట్టుటలేదు. ఏకాలమందైనను చచ్చుటయు లేదు. ఇతడొకసారియుండిమరియొకసారి లేకుండనుండుట లేదు. జన్మములేనివాడు, నిత్యుడు, శాశ్వతుడు, పురాతనుడై యితడు శరీరము చంపబడినను తాను చంపబడడు. 2-20

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరో ఽ పరాణి
తథా శరీరాణి విహాయజీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.

చినిగిన బట్టలను విడిచి క్రొత్తవానిని నరుడెట్లు గ్రహించుచున్నాడో, అట్లే జీర్ణములైన దేహములను విడిచి, కొత్తవానిని దేహి పొందుచున్నాడు. 2-22

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ
మక్లేద్యోఽ శోష్యఏవ చ
నిత్యస్సర్వగతస్థాణు
రచలోఽయం సనాతనః.

అతడు నరకబడతగని వాడు, కాల్చుటకు సాధ్యము కానివాడు, తడుపబడవీలులేనివాడు, శుష్కింపజేయ

సాధ్యముకానివాడు, నిత్యుడు, అన్నియెడలనుండువాడు, ఒకచోట నెలకొననివాడు, చలించనివాడు, సనాతనుడు. 2-24

అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి.

అతడు వ్యక్తముకానివాడు, చింతింప వీలులేనివాడు. వికారము పొందింపబడజాలనివాడని చెప్పబడుచున్నాడు. కావున నతని నట్లు తెలిసికొని నీవు దుఃఖింపగూడదు. 2-25

దేహీనిత్య మవధ్యోఽయం దేహేసర్వస్య భారత
తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితుమర్హసి.

ఎల్లర శరీరమందున్న యీయాత్మ యెన్నడును చంపబడ వీలులేనివాడు. కావున ఈభూతముల వేనిని గూర్చియు దుఃఖింపనక్కర లేదు. 2-30

యావత్సంజాయతే కిఞ్చిత్ సత్త్వం స్థావరజంగమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ తద్విద్ధి భరతర్షభ.

స్థావరమైనదిగాని, జంగమమైనదిగాని, ఏప్రాణి పుట్టినను నది క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగమువలన కలిగినదని తెలిసికొనుము. 13-27

యథా సర్వ గతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రాఽవస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే.

అంతటను వ్యాపించియున్న యాకాశము సూక్ష్మమైన దగుటచేత నెట్లు దేనికి నంటక యుండునో, అట్లే అన్ని యెడలను నిలిచియున్న యాత్మ దేహములందు వాని నంటకయుండును. 13-33

యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత.

సూర్యుడొక్కడే యయినను లోకమంతటి నెట్లు ప్రకాశింపచేయుచున్నాడో, అట్లే ఓ యర్జునా! క్షేత్రి, క్షేత్రమునంతటిని ప్రకాశింపజేయుచున్నాడు. 13-34

(9)

## కర్మ విధి.

(గీత - అధ్యాయము 15).

జీవునికిని పరమాత్మకును పరస్పరసంబంధ మేమి? దేహమునకును దేహములో రాజ్యముచేయు జీవునికిని సంబంధమేమి? వీనినిగూర్చి యిప్పుడు చెప్పబడును. దేహమునకు జీవాత్మ యెట్లో, అట్లే జీవాత్మకును పరతత్త్వము. దేహమును జీవుడెట్లు చేతనపదార్థముగ ప్రకాశింప జేసికొని దానిలో నంతర్భావమై యుండునో అదేమాదిరిగ జీవునిలో

పరమాత్మ అంతర్భావమై నిలిచి, యాజీవునికాధారమై వచ్చుచున్నాడని చెప్పవచ్చును.

జీవుడెట్లొకదాని తరువాత నొకటిగ పలుదేహము లను ధరించుచున్నాడో, ఒక్కొక్క రూపమును ధరించి, ఆ రూపమే తానగుచున్నాడో, అదే రీతిగ పరమాత్మ పలు జీవుల రూపముల నేకకాలమున ధరించి నిలుచును. ఒకవస్తువే రాజుగనో భిక్షుకుడుగనో ఎద్దుగనో పందిగనో మామిడి చెట్టుగనో పురుగుగనో రూపమును బొందునట్లు, పరబ్రహ్మ మును పలురూపముల ధరించి నిలిచియుండవచ్చును. కాని, ఆత్మయే రాజు కాలేదు. పురుగును కాలేదు. అట్లే పరమాత్మ యు మనుష్యుడై యుండలేదు. ప్రత్యేకముగానే నిలిచి యుండును. ఏదేహములోను, ఏవస్తువులోను పరవస్తువు నిలిచి, దానికాధారమై వచ్చుచున్నదనుట దీనితత్త్వము. అది భాగములగుటకు వీలులేదు. పలువస్తువులలో నిలిచినను దాని యేకత్వము చెదరిపోదు.

పరమాత్మకును జీవునికిని నున్న పరస్పరసంబంధము నికమీద విచారింప నారంభింతమన్న, ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము, అను వాదములలోనికి పోవలసియున్నది. భగవద్గీతలో ద్వైతాద్వైతప్రశ్నను ఎత్తుకొనుటలేదు. మూడుసిద్ధాంతములకును గీతనే ప్రమాణముగా జేసికొని

మతాచార్యులు భాష్యములు చేసియున్నారు. ఉపనిషత్తులను నిట్లే మూడువిధములగు సిద్ధాంతములకును నెడమిచ్చును.

జీవాత్మకును పరమేశ్వరునికి నేమి సంబంధమను విష యమున అభిప్రాయభేదములున్నను, మూడువిధములగు సంప్రదాయములందును కర్మవిధి యొప్పుకొనబడుచున్నది. అనగా జీవుడు కర్మవిధియందు బద్ధుడై నిలిచియున్నాడని యభిప్రాయము.

ఇంద్రియములును, ఇంద్రియములను నడిపించు మనస్సును ఈ యారింటిని పొందినది దేహము. ఇదే జీవుని కిల్లు. ఈయిల్లు అచేతనభూతప్రకృతిచే చేయబడినది. ఒక దేహమును ధరించునాత్మ యాదేహముతో విషయముల ననుభవించుచున్నది. చేష్టలన్నియు గుణములుగా మారగా నాగుణములు లాత్మతోకలిసి నిలుచుచున్నవి. ఒక దేహమును విడిచి వేరు దేహమును ధరించునప్పుడు పూర్వజన్మమున పొందిన కర్మఫలములాత్మనంటిపెట్టుకొని నిలుచును. ఇదేక్రొత్త దేహపు మూలధనము, లేక గుణము. ఒక శరీరమును విడిచి, బయటికిపోవు నాత్మ యాదేహములో పొందిన గుణములను గొనిపోవుచున్నది. వానితో క్రొత్తదేహములో ప్రవేశించు చున్నది. గాలి యొకతోటమీదుగా వీచుచు నక్కడనుండు పరిమళమును గ్రహించుకొని పోవునట్లే, యాత్మయును తా నెత్తిన జన్మములో కర్మములను సూక్ష్మరూపమున కొనిపోవు చుండును.

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః।
మన షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి।

నాకిరణ మొకటి జీవలోకమునచేరి యచ్చట జీవాత్మయై, యైదింద్రియములను, ఆరో ఇంద్రియమైన మనస్సును కూడికొని నిలుచుచున్నది. 15-7

శరీరం య దవాప్నోతి యచ్చాప్యుత్క్రామ తీశ్వరః
గృహీ త్వైతాని సంయాతి వాయుర్గంధా నివాశయాత్.

అక్కడక్కడ నుండు పరిమళములను గ్రహించి గాలి చలించునట్లు, యజమానుడైన యాత్మ యేదో యొకదేహమును బొందునప్పుడును, విడుచునప్పుడును పూర్వవాసనలను గ్రహించుకొని తిరుగుచుండును. 15-8

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే.

వినుట, చూచుట, తాకుట, రుచిచూచుట, మూచూచుట, వీనిని గూర్చిన ఇంద్రియములలోను, మనస్సులోను, నెలకొని జీవుడు విషయముల ననుభవించుచున్నాడు. 15-9.

ఒకజీవుని పరిణామమతనిచేతిలోనే యున్నది. మంచికర్మమును చెడుకర్మమునుచేసి తనకు తానేమంచిని చెడుగును తెచ్చుకొనుచున్నాడు. ఆత్మ ఉత్తమాధమపదములకు పోవు మార్గమాతడేర్పరుచుకొన్నదే. ఈయాధారమును స్వాతంత్ర్య

మును జీవునికి ముఖ్యగుణములు. ఒక దేహములో చేరినకాలమున తాను చేసినచేత లా దేహమును విడువగనే యాత్మను విడిచిపోవు. మరుజన్మములో లెక్కయారంభించునపుడు వెనుక జన్మములోని కర్మముల యాదాయనష్టములతోనే యారంభింపవలెను. ఇదే కర్మవిధి.

లోకములో కనబడు సుఖదుఃఖములకును గుణభేదములకును కారణమును విచారించి చెప్పునట్టి యేమతమునకైనను ఆక్షేపణలను చూపవచ్చును. ఎట్టి సమాధానమును చూపినను గౌరవులుండనే యుండును. బుద్ధిపరిచ్ఛేదమునకు సంపూర్ణముగ లోబడియుండదు. ఇదియే పీఠికలో చెప్పిన యీశ్వరరహస్యము కావున కంటికగపడు దేహములో కనబడనిఒకఆత్మయున్నది. దానికి చావులేదని యొప్పుకొన్నయెడల, సర్వభౌతికశాస్త్రానుభవములకును పొందికగల సిద్ధాంతము హిందూమతమునందు చెప్పబడు నీకర్మవిధి యొక్కటే. వేరు సిద్ధాంతమేదైనను దీనికంటె నెక్కువ యాక్షేపణల కెడమిచ్చును. పదార్థశాస్త్రములో జడపదార్థమునకును జడమైన శక్తిని నవినాశిత్వము చెప్పబడుచున్నది. అనగా ఒకపదార్థమునకో, శక్తికో, దానిరూపమును మార్పవచ్చునేకాని అది లేకుండ చేయవీలులేదు. ఈసిద్ధాంతము ననుసరించియే భౌతికశాస్త్రమంతయును విస్తరింపబడుచున్నది. జడపదార్థముల అవినాశిత్వమును చేతనముగు శక్తి ననుసంధించుటయే

కర్మవిధి. హిందూధర్మమున నడగియున్న సిద్ధాంతమిది. కారణ కార్యముల నిరంతరసంబంధముమీద నేర్పడిన సిద్ధాంతమిది. కారణమునకు కార్యము సమము. కారణము ఫలమునివ్వక తప్పదు. కారణమునకు మరురూపమే ఫలము. కావున దేహ వియోగము తరువాతను నాత్మయున్నదనిన నది తాను చేసిన చేతలఫలమును గ్రహించియే యుండును. ఇదియే కర్మవిధి. 'ఇన్సాల్వెన్సీకోర్టు'లో అప్పులను రద్దుచేసి విడుచునట్లు కర్మ విధిలో పొసగదు. ప్రాతయప్పులను తీర్చియే తీరవలెను.

## (10)

## కర్మఫలము.

ఒకకొలనిలో నొక రాయివేసిన నది నీటిని కలతపెట్టి యలలను గలిగించును. ఎంతటి చిన్నరాయియైనను దాని వేగమునకును భారమునకును తగిన యలలను కలిగించును. ఆకలత కంటికి కనబడనంత చిన్నదైనను దానివేగముచే నల లేర్పడి యొడ్డును తాకును. ఒకయల మరియొకయలను విరుచును. ఒకదానితోనొకటి కలిసి పెరుగుటయు తగ్గు టయు కలదు. కావున నెంతటి చిన్నచలనము వ్యర్థముకాదు. ఈవిధముగనే మనచేతలును ఆత్మకు చెందినంతమట్టుకు మన స్సున నుదయించు కోరికలును ఆశలును చేతలే యగును.

కడురహస్యమైన మనోవికారములుగూడ పరతత్త్వమను ఆకాశసముద్రమందలలను కలుగచేసి చరించును. అవి తమ ఫలములను కలిగించియే తీరును. ఆఫలములను తెచ్చుకొనిన జీవుడు వానిని మరల ననుభవించియే తీరవలెను. ఒకడు తక్కినజీవులకు కలిగించు సుఖమునకును దుఃఖమునకును తగిన బహుమతియో దండనయో పొందును. మన మాలోచించు నొక్కొక యాలోచనయు, చేయు నొక్కొకచేతయు వెంటనే మనలనే తాకుచుండును. ఒకచేతను చేయువాడే దానిఫల మును మొదట పొందును. ఇపుడు నేనొక మంచి యాలోచన నాలోచించినయెడల, లేదా మంచిపనిచేసినయెడల, దాని ననుసరించి ఆగుణము వెంటనే మంచిదగును. ఒకచెడుగు నాలోచించినను, ఒక చెడ్డయాలోచనకు మనస్సులో నెడ మిచ్చినను దానిననుసరించి యాత్మ కీడునుపొందును. కంసాలి బంగారునగనుచేసి రూపమునిచ్చునట్లు మనయాత్మను మనము కర్మమను సుత్తితో ప్రతిక్షణమును కొట్టుకొనుచునే యున్నాము. దేహమునువిడిచి మరియొక దేహమును పొందు నపుడు పూర్వముచేసిన కర్మములఫలమును, ఆలోచించిన యాలోచనలఫలమును పొందియే యుందుము.

ఇప్పుడు నేను కోపమునడచికొన్నయెడల, రేపువచ్చు కోపము నడచుకొనుట సులభమగును. తాల్మియే స్వభావమై నిలుచును.ఇప్పుడు కామపరమగు నాలోచన కెడ మిచ్చిన

యెడల రేపుదాని వేగము నరికట్టజాలను. అదే అభ్యాసమై నిలుచును. చేసినచెడుగునకో ఆలోచించిన చెడ్డ ఆలోచనకో నేడుపశ్చాత్తాపము పొందియున్నయెడల ఆగుణము రేపు మరి పుట్టదు. ఇట్లేమంచిగుణములును. చనిపోవుకాలమున తలపును నిట్లే. కడచినకాలము నెట్లుపయోగింతుమో యట్లే మరుజన్మ ములోని తలపులుండును.

## 11

## కర్మవిధికి ఆక్షేపములు.

'అంతయును విధికి లోబడియున్నది. మనమేమిచేసిన నేమి?' అని చెప్పుట కర్మవిధి కాదు. కర్మవిధియని హిందూ శాస్త్రములందు చెప్పబడు సిద్ధాంతము వేరు. 'పురుష ప్రయత్న మావశ్యకము; అదే ముఖ్యము' అనుటయే కర్మ విధి. 'పురుషప్రయత్నమువలన ఫలములేదు.' అని చెప్పిన కర్మవిధికి శుద్ధవిరుద్ధము. నిన్న చేసిన చేతకు ఫలమును నే డనుభవించియే తీరవలెననుటవలన మనుష్యుని స్వాతంత్ర్య మును తీసివేయుట కాదు. పురుషప్రయత్నపుశక్తికి హిందూ మతసిద్ధాంతము సంపూర్ణప్రాముఖ్యమును, సంపూర్ణస్వాతం త్ర్యమును మనుష్యున కిచ్చుచున్నది. 'అంతయు నీశ్వరుని పని. ఈశ్వరుని యనుమతిలేక యొక్కటియుగాదు' అనుట

నిజమే. కాని కర్మవిధి యీశ్వరుని చేష్టయే, వేరుకాదు. కర్మ విధి యనునది దైవముకాదు. అది దైవముచే నేర్పరుపబడిన యొకవిధి. జగమంతయు నొక చక్కని ప్రణాళికకు లోబడి యున్నది. అట్టి ప్రణాళికలో కర్మవిధియు నొకటి.

"ఔనౌను! ఇదియొక కల్పనయేకాని వేరుకాదు. తల్లిదండ్రుల మొగము పోలిక, గుణము, ఇవి వారి సంతానమునకును సంక్రమించుచున్నవి. ఇదే మన యనుభవము." అని కర్మవిధి కాక్షేపణ చేయవచ్చును. కాని యిది యాక్షేపణ కాదు. ఏయాత్మయే దేహమును ధరించుననుమాట వేరు. తండ్రివలె కొడుకుండును అను దేహధర్మము వేరు. కొడుకు దేహమును గుణమును తండ్రినుండి సంపాదించినవగును, కాని యే తండ్రి కెవడు కొడుకై పుట్టినాడో ఎవరికి తెలియును? కొడుకు దేహము తండ్రిదేహమును పోలియుండుననుట నిజమే. కాని ఆకొడుకు దేహములోనే ఆత్మవొచ్చియున్నదనుట వేరువిషయము. దానిని కర్మవిధి నిశ్చయించుచున్నది.

చెడురూపమునో, చెడుగుణములనో కొని యొకడు కడుపులోప్రవేశించి ఆరూపమును, ఆగుణములను పొందును. కాని అట్లు పొందుటకేయాత్మ తనకర్మముచేత తగియుండునో, యాఆత్మ యాతండ్రికడుపున పుట్టును. శరీరము, గుణము, ఇవి కర్మముచేతను పరంపరాగతములై యుండును. ఈ పరంపరకు

బాధ్యత ఎవరిదని తీర్మానించునది యాయా యాత్మలకర్మము. ఒక యింజనీరు తనకు తెలిసినమాదిరిగ, తన యిష్టమునుబట్టి యింటిని కట్టవచ్చును. కాని దానిలో నివసించువాడు అతను చేయుకర్మముల ననుసరించి ప్రవేశించును. ఒకడు తనయింటిని శిథిలపరుపవచ్చును. దానికి తగిన పేదవాడొకడు తరువాత దానికి వెలనిచ్చియో, బాడిగనిచ్చియో దాని ననుభవించుటకు రావచ్చును. అట్లే తండ్రి తనయొడలిని గుణములను చెరుచుకొని తనకు పుట్టినపిల్లల దేహమును గుణమును మొదటినుండియు చెరుపవచ్చును. కాని యా దేహములకు దగినయాత్మ అతనికి పిల్లలుగ దేహము బొందగోరివచ్చును. ఔరసపుత్రుడనుట దేహమును పొందుటవట్టుకే. ఏయాత్మకును ఏయాత్మయు కొడుకు కాదు. కర్మమునకు దగినట్లు దత్తపుత్రునివలె వచ్చి చేరువాడే కొడుకు. ఐనను ప్రకృతి శాస్త్రములలో చెప్పబడి మనయనుభవమున కానబడు పరంపరావిధియైన దేహధర్మము, కర్మవిధిని కొరతపరుప చాలదు.

## (12)

## ప్రకృతి, జీవుడు, పరమాత్మ.

(గీత : 7, 9, 13, 15 అధ్యాయములు).

ప్రపంచముననున్న ప్రాణములేని యన్నివస్తువులు, స్థావర, జంగమ ప్రాణుల దేహములు ప్రాణుల యింద్రియ

మనోబుద్ధి సూక్ష్మములు మొదలగువాని కన్నిటికిని ప్రకృతి యనిపేరు. ఒక్కొక్క ప్రాణిలోను యజమానిగానుండి దానిని నడిపించి దానిమూలమున విషయముల ననుభవించుచు వచ్చు వాడు జీవుడు. ఆ ప్రకృతి, జీవుడు ఈ రెంటికిని వెనుక మరుగుపడి యుండి, నిలుకడలేక మారిమారి వచ్చు ప్రపంచమునంతటిని దాల్చి యొకనియమముతో పరిపాలించుచు మారుదలయు నాశమును లేనిపరమాత్మ కీశ్వరుడనియు, శ్రీమన్నారాయణు డనియు నింకను నెన్నోపేళ్ళున్నవి. 'వాడు' అనువాడు వస్తువునకు లోపల మరుగుపడి అడగియుండును; ప్రమాణ మునకును ప్రాణముగా నిలిచియుండును; ప్రత్యేకముగ గూడ నిలిచియుండును.

జగత్తునియమముగురించి గీతలోని 7, 9, 13, 15 అధ్యాయములలో చెప్పబడియున్నది. వానిని దెలిపినమీాదట వానియర్థము చెప్పబడుచున్నది. ముఖ్యములైన శ్లోకములు:

ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధిప్రకృతి సమ్భవాన్.

ప్రకృతి, పురుషుడు, ఈ రెండును అనాదులని తెలి యుము. రూపముయొక్క మార్పును, గుణములును ప్రకృతి వస్తువులందుండునవని తెలియుము. 13-20.

కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే.

కార్యములకుగల హేతువు ప్రకృతివస్తువందురు. సుఖదుఃఖములు కలుగుటకు హేతువు పురుషుడందురు. 13-21.

పురుషః ప్రకృతిస్థోహి భుంక్తేప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు.

పురుషుడు ప్రకృతిలోనుండి ప్రకృతివలన పుట్టిన గుణముల ననుభవించుచుండును. గుణములలో నితనికుండు సంగమే ఇతడు మంచివియు, చెడ్డవియునగు జన్మముల నెత్తుటకు గారణమై యున్నది. 13-22.

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.

లోకములో క్షరము, అక్షరము అను రెండువిధముల తత్త్వములున్నవి. క్షరమనగా సర్వభూతములు; వానిలో మారకుండనుండు వస్తువక్షరము. 15-16.

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యోలోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః.

పురుషుడనువాడు జీవుడు. ఉత్తమపురుషుడు వేరు. అతడే పరమాత్మ యనబడువాడు. అతడు మూడులోకములను నావరించి వానిని ధరించుచున్నాడు. అతడవ్యయుడు, ఈశ్వరుడు. 15-17.

యస్మాత్ క్షరమతీతో౽హ మక్షరాదపిచోత్తమః
అతో౽స్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః.

నేను క్షరమునకు మించినవాడనై అక్షరముకంటె నుత్తముడనై యుండుటచేత లోకమునందును వేదమునందును పురుషోత్తముడని పొగడబడుచున్నాను. 15-18.

భూమిరాపో౽ నలో వాయుఃఖం మనోబుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.

భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి అహంకారము ఈ యెనిమిది భేదములుగా నాప్రకృతి వేరుపడియున్నది. 7-4.

అపరే౽యమిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మేపరామ్
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతేజగత్

ఇది నానికృష్టస్వరూపము. దీనినుండి వేరుపడియున్న నాస్వరూపమును దెలిసికొనుము. అదే ప్రాణులకు ప్రాణమనునది. దానిచేతనే నీలోకము ధరింపబడుచున్నది. 7-5.

ఏత ద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా.

ఎల్లప్రాణులకును నదికారణమని తెలియుము. లోకమంతయు నావలన పుట్టుటయు, నాయందు లీనమై లేకుండబోవుటయు కలుగుచున్నది. 7-6.

మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.

నన్ను మించియున్న వస్తువేదియు లేదు. దారమునందు మణిగణములవలె నీడియంతయును నాయందు కూర్పబడి యున్నది. 7-7.

రసో౽హమప్సు కౌంతేయ ప్రభా౽స్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు.

నీటిలోని రసము నేను. నేనే సూర్యచంద్రులలోని కాంతిని. అన్ని వేదములలోను నేను ప్రణవము. ఆకాశము లోనిశబ్దము నేను. మనుష్యులలో నేను పౌరుషమును. 7-8.

పుణ్యో గంధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు.

భూమియందలి గంధగుణమును, అగ్నిలోని తేజస్సును, అన్ని ప్రాణులలోని ప్రాణమును నేను, తపస్సుచేయువారి తపస్సు నేను. 7-9.

బీజం మాం సర్వ భూతానాం విద్ధిపార్థ సనాతనం,
బుద్ధిర్బుద్ధి మతా మస్మి తేజ స్తే జస్వినామహం.

ఎల్లప్రాణులకును నేను సనాతనమైన బీజమని తెలియుము. బుద్ధిగలవారి బుద్ధిని నేను. కాంతిగలవారి కాంతిని నేను. 7-10.

బలం బలవతాం చాహం కామరాగ వివర్జితం,
ధర్మా ఽవిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ.

బలముగలవారిలో కామరాగములులేని బలమును నేను. ప్రాణులయందు ధర్మమునకువిరుద్ధము కాని కామమును నేను. 7-11

యేచైవ సాత్త్వికా భావారాజసా స్తామశాశ్చయే,
మత్త ఏవేతితా న్విద్ధి నత్వహం తేషు తేమయి.

సాత్త్విక, రాజస, తామస గుణములకు సంబంధించిన భావములెల్ల నానుండియే పుట్టును. వానిని నాయందుంచుకొందును. నేను వానియందుండను. 7-12

త్రిభిర్గుణ మయైర్భా వైరే భిస్సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి మా మేభ్యః పరమవ్యయం.

ఈమూడుగుణములుగా నున్న భావములతో ఈలోక మంతయు మోహమును బొంది వీనియన్నిటికి నతీతుడనై నాశరహితుడనైన నన్ను తెలిసికొనలేదు. 7-13.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మా మేవయే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే.

గుణములచేత నొప్పుచున్న యీ నా దేవమాయను గడచుట కష్టము. నన్నే యెవరు శరణు పొందుదురో వారే యీ మాయను గడువగలరు. 7-14.

నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః
మూఢోఽయం నాభిజానాతిలోకోమామజ మవ్యయం.

యోగమాయచేత చుట్టబడి యుండుటవలన లోకము లో నెవరికిని కనబడను. ఈజ్ఞానములేని లోకులకు పుట్టుకయు నాశమును లేని నన్ను గూర్చి తెలియదు. 7-25.

ఇచ్ఛా ద్వేష సముత్థేన ద్వంద్వ మోహేన భారత
సర్వభూతాని సమ్మోహం సర్గేయాంతి పరంతప.

ఇచ్ఛా ద్వేషములచేత గలిగిన రెండు విధములగు మోహమువలనను నెల్లప్రాణులును లోకములో మోహము నకు వశమగుచున్నవి. 7-27.

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తి నా
మత్స్థాని సర్వభూతాని నచాహం తే ష్వవస్థితః

అవ్యక్తమూర్తితో నే నీలోకమంతటను వ్యాపించి నిలుచుచున్నాను. నాలో భూతములన్నియు నెలకొనియున్నవి. నా నెలవు వానిలో లేదు. 9-4.

న చ మత్స్థాని భూతాని పశ్యమే యోగ మైశ్వరమ్
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః.

మరియొక విధముగ చూచినచో భూతములు నాలో నిలిచియుండలేదు. నా యీశ్వరయోగమును జూడుము. ప్రాణులను నేనే ధరించుచున్నాను. అయినను వాని నాశ్రి

యించి యుండలేదు. ప్రాణులకుండిన ప్రత్యేకత్వమును నా
వలననే కలుగుచున్నది. 9-స.

ప్రకృతిధర్మమునను సరించి జగమంతయు నడచుచువచ్చు
చున్నది. ఈప్రకృతి ధర్మమును భౌతిక విజ్ఞాన శాస్త్రజ్ఞులు
తెలిసికొని నిర్ధారణ చేసియున్నారు; ఇంకను చేయుచునే
యున్నారు. అయినను నీప్రకృతిధర్మమెట్లున్నదో విజ్ఞాన
శాస్త్రమున గానవచ్చుటలేదు. ఒకనిర్మాణము లేక యంత్రము
లేక ప్రాణి దేహస్వరూపము, అంగములయొక్క, గుణములు,
అవిచేయు కార్యవిధానము వీనిని పరిశోధించి నిర్ణయించి
చెప్పుట విజ్ఞానశాస్త్రమునకు విషయము. ఆప్రకృతి నియమ
మెట్లున్నదని తెలియుట కాశాస్త్రమునకు సాధ్యముకాదు.
'ప్రకృతివిధి' 'స్వభావనియమము' అనుపదముల స్వభావమున
నొక ప్రత్యేకశక్తి యుండుననియు అది యీప్రపంచమందలి
భౌతపదార్థము లనుసరించి వచ్చుచున్నవనియు చెప్పుట
సరికాదు. మనము పరిశోధించి కనుగొనిన సత్యములకు
సంగ్రహముగా మనమొసగు పేరుమాత్రమే 'స్వభావము.'
అట్టిపేరు పెట్టినంతమాత్రముననే మూలకారణమును చూపి
గ్రహించినట్లుకాదు. ఒకపేరే కారణమైయుండదు. జ్వరము
వచ్చినవానికి తలనొప్పియుండును. జ్వరము తలనొప్పును కలి
గించిన దందుము. 'కామిలరోగము కంటిని పచ్చగాచేసినది'
అందుము. 'కామిల' అనునొక పిశాచమో, భూతమో, యా

కేతిగా జేసినదని చెప్పుట సరికాదు. కలరాయో, ప్లేగు జ్వరమో, చాలామందిని చంపినవి అనునప్పుడు కలరా యను నొకరాక్షసుడు, లేదా ప్లేగుఅను నొకయసురు డిందరు మనుష్యులను తనకెరగా జేసికొన్నాడని చెప్పుట సరికాదు. అదిమనసును చూచినవిషయములను సంగ్రహముగా చెప్పువిధమే తప్ప, కార్యమునకు కారణమును చూచి గ్రహించు విధము కాదు. ఇట్టే ఒకదానినిగూర్చి యిది ప్రకృతివిధి యనిన, కారణమును జూచి గ్రహించితిమనుట కాదు. ప్రకృతిధర్మ మనునదియు, ఈశ్వరసంకల్పమనునదియు నొక్కటే. ఈశ్వర సంకల్పమునకే ప్రకృతివిధి యేర్పడియుండును. ఈశ్వరు డున్నాడని యనుకొందము. ప్రకృతివిధి నాతడు సంకల్ప ముగా నేర్పాటుచేసికొని యుండవలెను.

మనవేమనక లేక సంతోషమున కీశ్వరుడు తన సంకల్పమును మార్చుకొనడు. స్వభావనియతి యనునది ఈశ్వరుని సంకల్పము. అది దినదినమును మారిమారి అనగా ఒకనాడుండినది మరునాడుండక వ్యవస్థలేకయే, లోక మును నడిపించుటను చూచుచున్న కారణము చేతనే ఈశ్వరుడను నొక చేతనాశక్తి యున్నదని ఒప్పుకొనవలయు నని వాదించుట మూఢత్వము. ఈమూఢ్యముచేతనే యాస్తి కనకాధారముగా వేనినైన నాశ్చర్యకరములగు సంభవములనే కొన్ని మతములవారు వెదకికొనుచున్నారు. సాధారణముగ

మనము దినదినమును చూచు ప్రకృతిధర్మమే పెద్ద యాశ్చర్యము. అదియే చాలు నీశ్వరునియందు భక్తి కాధారమును కల్పించుటకు. నేడు సూర్యుడుదయించి యస్తమించి, రేపు తిరిగి ఉదయింపకుండినను, అదియు ప్రకృతిధర్మములో చేరునే కాని, యది మాత్రము ప్రత్యేకముగా యాస్తిక నిదర్శనము కాజాలదు. వానయు, మెరుపును, గాలియు, భూకంపమును నొకానొక సమయమున నియమము తప్పివచ్చును. ఒకనా డుండువిధము మరునాడు లేదు. దానిని చూచి తృప్తిపడుదుమా? ఏదియైనను, ఏవిధమున కనబడినను, వానికన్నిటికిని కలిపి యొక్కటే పేరిచ్చుచున్నాము. 'ప్రకృతి' లేక 'స్వభావము' అని. కావున నున్నపాటున క్రొత్తగా నియమమును తప్పినడచినయెడల నొక లాభమును లేదు. నియమమనునది పుస్తకములో వ్రాయబడి యున్నదికాదు. ఇదివరకు లేని యొక క్రొత్తదానిని చూచినను నదికూడ ప్రకృతి నియమములోనే చేరును.

ఈశ్వరుని సంకల్పము తాను కనబడక, మరుగుననుండి, సకలమును కారణకార్యరూపమున నడిపించుచుండుటయే. దీనినే పై గీతాశ్లోకములలోని తుదిరెండు శ్లోకములు చెప్పుచున్నవి. 'మరుగుపడి యున్నాడీశ్వరుడు' అనుదాని తత్త్వమేమి? ఏతత్త్వమును పరీక్షచేయుచున్నామో దానిలో పరిశోధన చేయుచున్న మన మిమిడి యున్నాము. పరిశోధన

చేయబడిన విషయములో మనమును మనబుద్ధియు చేరి యుండనందున యీ అదృశ్యత ఏర్పడుచున్నది.

ఒకగారడివాడొక కొలనిని సృష్టిచేసి, దానిలో చేప లుండునట్లు చేయుచున్నాడని యనుకొందము. చల్లని నీటిలో నున్న చేపలా కొలనిని స్వాభావికసృష్టిగనే యెంచును. ఆహారమును సంపాదించుకొని, యొక యాశ్చర్యమును బొందక, తమజీవితమును వ్యాపారమును సాగించుచుండును. గారడివానిచేత సృష్టింపబడినవానిబుద్ధికి, గారడివాని యునికియు సంకల్పమును దెలియదు. ఉన్నపాటున నతడా కొలని నీటిని వేడినీళ్లుగచేసి, చేపలకు దుఃఖము నేర్పాటు చేసిననుగూడ చేపలు దాని కొక కారణమును చూచుకొని శాంతినొందును, లేదా చచ్చును. అంతే. గారడివాడు బయ టికి కనబడడు. లేదా, వేడినీటిలో కూడ ఆచేపలు జీవించి యుండుటకు గారడి వాడేమిచేసినను, వారిలో విజ్ఞానశాస్త్ర జ్ఞులై పరిశోధనచేయుచేపలు తమ స్వభావవిధిని పుస్తకము లలో వ్రాయుదురు. ఇటే యీశ్వరుడును మరుగుననుండి నిలిచియున్నాడు.

అంతయును నిశ్చలనియమములకు లోబడి నిలిచి యున్నను, కారణకార్యసంబంధమున నున్న గొప్ప స్వాతం త్ర్యము మన మనుభవించు చున్నాము. కారణమునకును

కార్యమునకును నేర్పడియున్న మార్పులేని బంధమోక్షప్రక్రి
మనకున్నను, అదే మనకు కర్మస్వాతంత్ర్యమును తెచ్చుచున్నది.

జగత్సృష్టియు, స్థితియు నీశ్వరునినుండియే వచ్చును. ప్రకృతి యనునది తన పనిముట్టు అని క్రిందచూపిన శ్లోకములు తెలుపుచున్నది.

యథాఽకాశ స్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ.

అన్నిచోట్లను వీచుటకు మహాబలముగల గాలి ఎల్లప్పుడును నాకాశమున నెలకొని యున్నదో, అట్లే భూతములన్నియు నాలో నెలకొనియున్నవని తెలిసికొనుము. 9–6

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామ మిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్.

నాకు లోబడిన ప్రకృతియందు నిలిచి మరల మరల భూత సంఘమునంతటిని స్వభావబలముచేత సృష్టి చేసెదను. 9–8

మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్
హేతునాఽనేన కౌంతేయ జగద్విపరివర్తతే.

నాయధ్యక్షత్వమున ప్రకృతి చరాచరలోకములను సృష్టించును. ఈహేతువుచేత లోకము చుట్టిముట్టి తిరుగుచున్నది. 9–10

అహాం క్రతు రహాం యజ్ఞ స్స్వధాఽహ మహమౌషధమ్
మన్త్రోఽహమహమే వాజ్యమహామగ్ని రహాంహుతం.

నేను క్రతువు, నేను యజ్ఞము, నేను పితరులకిచ్చు పిండము, నేను ఔషధము, నేను మంత్రము, నే నాజ్యము, నే నగ్ని నేను హవిస్సు. 9-16

పితాఽహామస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజు రేవచ.

ఈ జగమునకు తండ్రిని నేను, తల్లిని నేను, దీనిని తాల్చువాడను నేను, నేనే పితామహుడను, తెలియదగిన తత్త్వము నేను, పవిత్రము చేయువాడను నేను, ఓంకారము నేను, ఋక్ సామ యజుస్సులును నేను. 9-17

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయం.

ఈలోకపు గతి నేను, భర్తను నేను, ప్రభువు, సాక్షి, నెలవు, శరణము, తోడును నేను. దీని పుట్టుక, స్థితి, నాసము, నాశములేని బీజమును నేను. 9-18

తపా మ్యహ మహాం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యుశ్చ స దస చ్చాహ మర్జున.

నేను వేడిని తెత్తును. వర్షమును నిలుపుటయు విడుచుటయు నేనే చేయుచున్నాను. నేనే అమృతము, నేనే మరణము. ఉండువాడను నేను; లేనివాడను నేను. 9-19

26.3.84

## 13.

# కర్మ యోగము.

(గీత: అధ్యాయములు 2, 4.)

హిందూమతమున మార్పునకును వృద్ధిచేయుటకును ఎడములేదని కొందరితలంపు. చెడిపోయి పాడయిన భాగములను తొలగించుటయు క్రొత్తవాని నేర్పాటు చేయుటకును వైదికమతమున వీలులేదని సాధారణముగ హిందూమతమును దూషించుట వాడుకయైనది. పూర్వులను గౌరవించుటచేతను ప్రాచీనమార్గములను, శాస్త్రములను గౌరవించుటచేతను ఒక మతాభివృద్ధి కడ్డములేదు. హిందూధర్మమనునది మార్పులను వృద్ధిని పొందని మతముకాదు. తత్త్వమేమని ప్రకృతిశాస్త్ర నిపుణులెట్లు సత్యమున కొఱకు దానికే బద్ధులై పరిశోధన చేయుచుందురో, అట్లే వేదాంతమందును మనపూర్వులు పరిశోధన చేసియున్నారు.

తత్త్వమే, ప్రధానముగా బుద్ధినిఅన్నిమార్గములలోను నెంతదూరము ప్రవేశింపచేయ వీలగునో అంతదూరము పోవుటకు దేనినైనను అడ్డమని యాలోచింపక సత్యశోధనను చేసి పొందిన విషయములే వేదాంతమనునది. అదేహిందూమతము

చున్నయాచారములను తగినకారణము లేక విడువగూడదను మనోభావము అభివృద్ధి కడ్డము రాదు. తత్వవిషయమున హిందూమతము మారిమారియేవచ్చుచున్నది. పుస్తకములను మాత్రము మార్ప వీలులేదు కాని, మనుష్యుల భావములును, విశ్వాసములును కలసియే యొక మతమగును. చైతన్యముగల మనుష్యసంఘపు మనస్సులోని తలపు లెట్లు మార్పాటు బొందునో, యట్లే వారిమతమును మారివచ్చుచున్నది. హిందూమతము మనుష్యునివృద్ధికి పూర్ణస్వాతంత్ర్యమిచ్చుచు వచ్చుచున్నది. ఎట్టి యడ్డమును లేక బుద్ధి నుపయోగించి పరిశోధనచేయు స్వాతంత్ర్యము నిచ్చుటచే లోకములోని వేరుమత మేదియును హిందూమతముతో ఏవిధముననను పోల్ప వీలులేదు.

హిందువులు శాస్త్రములుగా గ్రహించిన పురాణములు, స్మృతులు మొదలగు తొల్లింటి గ్రంథములం దొక్కొక్క విషయము ప్రధానముగ నున్నది. తత్త్వమునకు పలుమొగములున్నవి. ఒక్కొక్కముఖము, ఒక్కొక్కధర్మము, నారాధించుచున్నది. హిందూధర్మమును వృద్ధిపొందించుచు వచ్చిన ప్రాజ్ఞులాయాకాలములందు కనిపెట్టిన సత్యముల నాయాకాలములందు వ్రాసియుంచిరి. పదివేల సంవత్సరములుగ హిందూధర్మము వృద్ధినొందుచు వచ్చినది. అది మిగుల

చున్నాము. దాని యొకకొమ్మవలె మరియొక కొమ్మలేదు. చూచుట కధిక భేదములు కనబడును; కాని అన్నిటికి నొక్కడే జీవము. వ్యత్యాసములను చూచి భ్రమ చెందగూడదు.

భగవద్గీత యనునది హిందూమతమున నందరును నొప్పుకొని గౌరవించు గ్రంథము. దాని నన్ని సాంప్రదాయములకు జెందినవారును శాస్త్రముగ నంగీకరించియున్నారు. ఈ భగవద్గీతనుండి రెండు ముఖ్యములైన విషయములవలన హిందూమతము క్రొత్తకళను పొందినదని చెప్పవచ్చును. ఒకటి, కేవలము యాగాదిక్రియలకు అనగా వైదికయజ్ఞ మార్గమునకు ప్రాధాన్యము నిచ్చునది. రెండవది త్యాగ మార్గ మొక్కటే మోక్షసాధన మను నభిప్రాయమును స్థిరపరుచునది. జీవితమునకు కావలసిన కార్యములను చేసియే ధర్మమును నిలువవచ్చునను సత్యమును గీత చక్కగా చాటుచున్నది. సంఘక్షేమమునకు వలసిన కార్యములను జేయుచుండవలెననియు, ఆ కార్యములలో వాడువాడు తన కేర్పాటు కాబడిన పనులను సరిగ భగవత్ప్రీతిగ చేసినయెడల మోక్షమున కడ్డమేర్పడదనియు, అదియే కర్మబంధమునుండి విడబడుటకు మార్గమనియు గీత యొత్తి యుపదేశించుచున్నది.

ధర్మమార్గమున నిలుచువాడు తనకు సంఘములో నేమిపని యేర్పడియున్నదో దానిని చక్కగా జేయవలెను.

తన స్వభావగుణముచేతనో, తానుపుట్టిన కులము, కుటుంబము, ఉన్నస్థానము మొదలగు కారణములచేతనో తనకేర్పడియున్న కార్యములనెల్ల సరిగ జేయవలెను. కాని ఆకార్యములచే తనకే సుఖమో, లాభమో, కలుగవలెనను నుద్దేశముతో చేయగూడదు. 'నాపనిని నేను చేయవలెను' అను తలపు తప్ప, మనస్సులో కార్యమునందు తనకు ఫలము కలుగవలెనను నాశ నుంచుకొనగూడదు. లాభముకోరి యితరులు చేయునట్లే కర్మయోగియు తాను చేయుకార్యము నెక్కువ యాసక్తితో జేయును. ఉదాసీనముగా నుండడు. ఇతరులవలె పైకికనబడినను లోపల కార్యఫలమునకును నితనికిని మధ్య ఆశ యనుబంధము లేకుండ ప్రత్యేకముగ పనిజేయును. స్వీయలాభమును కోరకపనులను చేయగనే కార్యము సిద్ధించినయెడల మరల మైమరచి, సిద్ధింపనియెడల కృంగిపోవుట కలుగదు. కార్యమునందు కష్టములును, నడ్డములును నేర్పడినయెడల వానినెట్లో సహించుకొనవలెననిమాత్రము యోచించి చేయునేగాని వానికొరకు దుఃఖపడి మనస్సునకు కలతనొందించుకొనడు. స్వార్థము నపేక్షించని వానికి శాంతము తనంతటతానే వచ్చును. సుఖమును, దుఃఖమును, జయమును, అపజయమును, అతనిని తాకజాలవు.

ఈవిధము ననుసరించి పనులనుజేయ నలవాటుపడిన సాధకుడు యోగమున పైకిపోవుటకు కావలసినమార్గములందు

శక్తిని శీఘ్రముగా బొందును. అడుగడుగునకు బాగుగ చింతించుచు, మనస్సు నేకాగ్రము చేసి యింద్రియములను మనస్సును విషయములందు త్రిప్పక స్వాధీనమందుంచుకొని ధ్యానము చేయును. అట్టిధ్యానము చేయుటవలన జ్ఞానమును పొందును. ఆజ్ఞానమువలన నెల్లజీవులయందును తనయాత్మను చూచును. అంతయును భగవంతునిదివ్య విభూతి యందడగి నిలుచుటను గాంచును.

గీతలో జెప్పబడినమార్గము లోకవ్యవహారమును చేసి కొనుచునే యది తన యాంతర్యమును మట్టుకు తాకకుండ జేసి కొనుమార్గము. కార్యమును జేయక విడిచిపెట్టుట నిజమగు త్యాగము కానేరదు. కార్యముల ఫలములమీద నాశను విడుచుటయే త్యాగము. మోక్షమున కనగా విడుదలకుమార్గము కార్యప్రవృత్తులందు స్వార్థము నాలోచింపక యాత్మను విడిపించుకొనుటయే. ఆస్వార్థమునుండి మరలినపిదప నేకార్యము జేసినను నది యాత్మను కర్మబంధమున కట్టదు. ఇదియేగీతా సారము. ఇట్టి స్వార్థమును విడిచినయెడల జయాపజయము లందు మనస్సును త్రిప్పక, నిష్కామియై వాడువాడు తనతన పనిని చేసినయెడల, కర్మయోగ మార్గమునకును, సన్యాస మార్గమునకును గల వ్యత్యాసము తొలగిపోవును.

కిం కర్మకి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః
తత్తే కర్మప్రవక్ష్యామి యజ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్.

ఏది కర్మము, ఏది యకర్మము, అను విషయమున పండితులును మోహము నొందియున్నారు. కావున నీకుకర్మ స్వభావమును దెలిపెదను. దీనిని దెలిసికొని యశుభమునుండి విడబడుదువు. 4-16.

కర్మణ్య కర్మ యః పశ్యే దకర్మణి చ కర్మయః
స బుద్ధి మాన్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్.

చేసినదానియందు చేయకుండుటను, చేయనిదాని యందు చేయుటను నెవడు తెలిసికొనునో వాడేమనుష్యులలో బుద్ధిమంతుడు. ఎల్లపనులను జేయుచువచ్చినను వాడుయోగ మును బొందియున్నవాడు. 4-18.

యస్య సర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం త మాహుః పండితం బుధాః.

ఎవనిపనులన్నియు నాశనుండి విడబడియుండ,జ్ఞాన మనునగ్నిచే గాల్ప బడునో, వానిని పెదలు పండితుడని యందురు. 4-19

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే.

అప్రియత్నముగ కలిగిన లాభమును గొని సంతో షము గలవాడై, దుఃఖము తెచ్చునవియు, సుఖమునిచ్చు నవియు నను భేదమునువిడిచి, కార్యసిద్ధి కలిగినను, కలుగ

కున్నను, సమముగానిలిచిన వాడై మనస్సులో కోరతల కెడ మీయునివాడై నిలుచువాడు కర్మమును జేసినను దానిచే కట్టుపడడు. 4-22

కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన
మా కర్మఫలహేతు ర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి.

కర్మమును జేయుటయందు మాత్రమే నీకధికారము. దానిఫలములం దెన్నడును నీకధికారము లేదు. చేసినదానిఫలమును కోరకుము. కాని, కర్మమును చేయకుండుటయందు మనస్సును నిలుపకుము. 2-47

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోస్సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే.

యోగమునందు నిలిచి, సంగమునువిడిచి, కోరికనెరవేరుటయు నెరవేరకుండుటయు నొక్కటేయని తలచి, పనులను చేయుము. ఈసమబుద్ధియే యోగమనబడును. 2-48

## 14.

# కర్మయోగమే యజ్ఞము.

(గీత: అధ్యాయములు 4, 5, 6.)

వేదములో యజ్ఞము చేయవలెనని విధింపబడియున్నది. యజ్ఞము లేక వేల్మిలోని ముఖ్యాంశము త్యాగము. స్వార్థమును ఆశను వీడుటయే యజ్ఞసారము. కావున వేల్మి అనునది పలువిధముల జేయగూడిన దైవపూజ. ఇట్లు పలువిధముల జేయబడిన హోమములకు వేదములలో జెప్పబడిన ఫలముండును. మోక్షమును గోరువాడు కార్యమును జేయుట విడిచిపెట్టి యూరకుండవలెనని తలపక, తప్పక సకల కార్యములను యజ్ఞముననే చేసికొని విముక్తిని జెందవచ్చును. స్వార్థమును విడిచి చేసినకర్మ మొక యజ్ఞమే యగును.

యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనం
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ.

హోమము చేయగా మిగిలినది అమృతమగును. దానిని సేవించువారు మరణములేని పరమపదమును పొందుదురు. వేల్వనివారి కీలోకము లేదు. ఇక వారికి పరలోక మెక్కడిది! 4-31.

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే
కర్మజాన్ విద్ధితాన్ సర్వానేవమ్ జ్ఞాత్వా విమోక్ష్యసే.

వేదములలో పలువిధములగు యజ్ఞములు వివరముగ చూపబడి యున్నవి. అవి యెల్ల కర్మములను జేయుటవలన నేర్పడినవి. దీనిని దెలిసిన విముక్తి బొందుదువు. 4-32.

శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే.

ద్రవ్యములతో చేయబడిన వేల్మికంటె జ్ఞానముతో జేయబడినయజ్ఞమే మేలైనది. ఎట్టిపనియైనను జ్ఞానమునందు ముగింపు నొందుచున్నది. 4-33.

జ్ఞానయజ్ఞ మనునది జ్ఞానముతో జేయబడిన వేల్మి. నేయి మొదలగు ద్రవ్యములులేకయే జ్ఞానమనుద్రవ్యముతో చేయుబడుయజ్ఞము జ్ఞానయజ్ఞము. అనగా లౌకిక వ్యవహార మునకు కావలసినపనులను విధిగ జేయుట. ఏకర్మము జేసినను ఆకర్మము ఫలమును గూర్చి యాశను విడిచి, మనస్సును నిలుకడ పరుచునదే జ్ఞానము. దీనిచే రానురాను భేద భావములుపోయి, సకలజీవులందును తనయాత్మ నిలుచుట చూచును. అట్లే యెల్లజీవులును పరమాత్మ యందడగి నిలుచుటయును జూచును. దీనిని చూడచూడ నిష్కామమైన కర్మమును చేయుట సులభమగును. కర్మమును చేయునపుడు

దానిని ప్రేరేచు నుద్దేశమును బరిశుద్ధము చేసికొనినయెడల పాపమును, కర్మబంధమును మనలను చేరవు. ఇట్టి పరిశుద్ధమైన యుద్దేశము గలిగి చేయుటయే జ్ఞానము.

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మ సాత్కురు తేఽర్జున
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా.

బాగుగ మండుచున్న యగ్ని కట్టెల నెట్లు బూడిదగ చేయునో, అట్లే జ్ఞానాగ్నియనునది ఎల్లకర్మములను కాల్చి బూడిదగ జేయును. 4-37.

నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాఽఽత్మని విందతి.

జ్ఞానమువలె పవిత్రమైన వస్తువు యీలోకమున వేరేదియు లేదు. యోగములో బాగుగా నిలిచినవాడు తగిన కాలమున నీజ్ఞానమును తనకు తానే పొందును. 4-38

యోగసన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయం
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ.

యోగమార్గమును గొని తానుచేయు కర్మములందు సంగమునువిడిచి, జ్ఞానముచే సంశయమును పోగొట్టుకొని, తన్ను తానే కాచుకొనిన వానిని కర్మములు కట్టచాలవు. 4-41.

తస్మా దజ్ఞానసంభూతం హృత్ స్థం జ్ఞానాసి నాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత.

కావున అజ్ఞానముచేగలిగిన సంశయమును, జ్ఞానమను కత్తితో కోసి, యోగము నవలంబించి, కర్మములను చేయ నిశ్చయించి నిలువుము. 4-42

ఈజ్ఞానమును మనము పొందినపిదప, సాంఖ్యమార్గ మునకును, యోగమార్గమునకును, అనగా జ్ఞానమార్గము నకును నిష్కామయోగమార్గమునకును గల భేదమంతయు విడిపోవును. జ్ఞానమును కర్మమును చేరినచో కర్మయోగ మగును. సన్న్యాసమును, స్వార్థమును విడిచి యాచరించు కర్మయోగమును, ఒక్కటేయగును.

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏక మప్యాస్థిత స్సమ్య గుభయోర్విన్దతే ఫలం.

సాంఖ్యమును యోగమును వేర్వేరనిచెప్పువారు తెలి యని పిల్లలవంటివారు. తెలిసినవారట్లనరు. వీనిలో నేదో యొకదానియందు బాగుగానిలిచిన వాడు రెంటిఫలమును పొంద గలడు. 5-4

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీచ న నిరగ్ని ర్న చాక్రియః

ఫలము నెదురుచూడక, చేయవలసిన దానిని చేయు వాడే త్యాగి; యోగియునతడే. అగ్ని నారాధించుట మానిన వాడునుకాడు. కర్మములచేయనివాడునుకాడు. 6-1

యం సన్న్యాసమితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన.

దేనిని సన్న్యాసమని అందురో యదియే యోగమని తెలిసికొనుము. దీనిని పొందుటకు దీనిని చేసెదను, దానిని పొందుటకు దానిని చేసెదను, యను తలపును విడువనివా డెవడును యోగి కాజాలడు. 6–2

## 15.

## కర్మయోగమే సన్న్యాసము.

(గీత: అధ్యాయములు 5, 18.)

ఒకడు స్వార్థదృష్టిని, ఆశాబంధమును విడిచి, లోక మంతయు నొకటే యనుజ్ఞానమును పొందినపిదప సకల లౌకికకర్మలను చేసికొనుచునే యున్నను వాడు సన్న్యాసియే యగును.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వ న్నపి నలిప్యతే.

యోగముతోగూడి యాత్మశుద్ధి నొందినవాడు, తన్ను తాను గెలిచినవాడు జితేంద్రియుడు ఎల్లప్రాణులును తానే

యని యెంచువాడు, పనులను చేయుచున్నను అవి యతని నంటవు. 5-7

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽత్మశుద్ధయే.

యోగులు స్వార్థమును సంపూర్ణముగవిడిచి యాత్మ శుద్ధికొరకు శరీరముతోను, మనసుతోను, బుద్ధితోను, కేవల మింద్రియములతోనుగూడ పనులను చేయుచుందురు. 5-11

కర్మములను సంగము లేక చేయుట, సన్న్యాసమార్గము ననుసరింప ప్రయత్నము చేయుటకంటెను మేలైనమార్గమని గీతలో పలుచోట్ల పలువిధముల నొత్తి చెప్పబడియున్నది. కడపటి యధ్యాయమునకు పేరు 'సన్న్యాసయోగ'మని చెప్పియున్నను నాయధ్యాయము నారంభమందే భగవంతుడు ఇట్లు చెప్పుచున్నాడు.

కామ్యానాం కర్మణాంన్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫల త్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః.

ఫలముల నాసించి చేయు పనులను విడుచుటయే సన్న్యాసమని జ్ఞానులు తెలిసికొందురు. కర్మముల ఫలములను మొదలంట విడుచుటయే త్యాగమని వారు చెప్పుదురు. 18-2

నియతస్యతు సన్న్యాసః కర్మణో నో పపద్యతే
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః.

చేయవలసినపనిని విడుచుట తగదు. మోహముచేత దానిని విడిచిపెట్టుట తమోగుణముచే గలుగునని చెప్పుదురు. 18-7

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః.

నియమింపబడిన కర్మమును చేయునపు డిది చేయవలసినదని చేయుచు సంగమును, ఫలమును, గణింపక యొకడు విడిచిపెట్టినయెడల నాత్యాగమే సాత్త్విక మనబడును. 18-9

నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ సత్యాగీ త్యభిధీయతే.

దేహధారిచే పనులను మూలముట్టుగ విడిచిపెట్ట వీలులేదు. ఎవడు తాజేయు పనులఫలమును విడుచునో వాడే త్యాగి యనబడువాడు. 18-11

దీనినే బాగుగ స్పష్టముచేసి లోకనాథుని యనుగ్రహమునే నమ్మి, సకలమునతని కర్పణముగా చేయవలెనని క్రింద చూపిన శ్లోకములలో జెప్పబడియున్నది.

సర్వకర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయం.

నన్నే యాశ్రియముగ గొన్నవా ఢెల్లపనులను నెప్పు డును జేసికొనుచున్నను తరుగని నిత్యపదవిని నాయనుగ్రిహ ముచే పొందగలడు. 18-56

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ.

చేయుచేతలనెల్ల నాకే యర్పణచేసి, నన్నే పర మావధిగ నెంచి బుద్ధియోగము నాశ్రియించి యెప్పుడును నన్ను చిత్తములో నిలిపియుండుము. 18-57

## సుఖములేని త్యాగము.

(గీత: అధ్యాయము 3.)

మనస్సు సుఖముగానుండుట కడుగడుగునకును ధ్యాన ముచేయుట యావశ్యకము. ఆత్మ, లోకము, దైవము, వీని స్వరూపము నెల్లప్పుడు చింతించు చుండుటవలన మనస్సున గలుగు నుద్వేగము లడగిపోవును. కాని ధ్యానముమాత్రము చాలదు. దానితో బాటు తన కేర్పడియుండిన పనులను జేయుటయు నట్టి కర్మము నాచరించుటయందు స్వార్థమును, నాశయు విడిచి చేయుటయు మనస్సౌఖ్యమున కుత్తమమైన మార్గమగును. యోగమనిధ్యాసమునకు పేరు సాంప్రిదాయి

కము గావచ్చుచున్నది. కర్మయోగమనునది సంగమువీడి జ్ఞానముతో గూడ కర్మమును చేయుట. సరిగ చేసినయెడల రెండును నొక్కటే యని తెలియగలము. వానిలో నొకదానిని విడిచి మరియొకదానిని చేయజొచ్చుటవలన ఫలములేదని కనుగొనగలము.

పక్వముకాని మనస్సుతో త్యాగి కాజూచుటవలన ఫలములేదు. దానివలన మనస్సునకుసౌఖ్యముకలుగజాలదు. త్యాగపు గొప్పదనమును, ముఖ్యాంశమును, ఆశలను విడుచుటయే. ఆశలను విడిచి కర్మలను చేయవచ్చునుగదా! అట్లు చేయుటయు త్యాగమే. కావున సన్న్యాసమును కర్మయోగమును నొక్కటే యని గీత చెప్పుచున్నది.

లోకేస్మిన్ ద్వివిధానిష్ఠా పురా ప్రోక్తా మయానఘ
జ్ఞానయోగేనసాంఖ్యానాం, కర్మ యోగేన యోగినాం.

ఈలోకములో రెండు విధములైన నిష్ఠలు ముందే నాచే చెప్పబడినవి. సాంఖ్యులుచెప్పు సాంఖ్యయోగమార్గమును, యోగులుచెప్పు కర్మయోగ మార్గమును. 3-3

న కర్మణా మ నారంభా నైష్కర్మ్యం పురుషోశ్నుతే
నచ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి.

పనుల నారంభింపక యుండుటచేతనే మనుష్యుడు కర్మములను చేయనివాడు కాజాలడు. సన్న్యాసమును పూనిన మాత్రముననే మనుష్యుడు సిద్ధిని పొందజాలడు. 3-4

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యావశః కర్మ సర్వః ప్రకృతి జైర్గుణైః.

ఎవ్వఁడు నొక్కక్షణమైనను కర్మను చేయక నిలువ చాలఁడు. ప్రకృతివలన గలిగిన గుణములచేత నెల్లప్రాణులును తమకు తెలియకుండగనే కర్మము చేయుటకు పురికొల్ప బడుచున్నవి. 3–5

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా, మిథ్యాచారస్సఉచ్యతే.

కర్మేంద్రియముల నడచికొనియు నింద్రియ విషయములను మనస్సులో స్మరించు కొనుచుండువాడు మూఢుడు. వాని నడవడి మిథ్యయని చెప్పబడును. 3–6

యస్త్వింద్రియాణి మనసా నియమ్యా రభ తేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్సవిశిష్యతే॥

ఎవడింద్రియములను మనస్సుచే అరకట్టి కర్మయోగ మార్గమున కర్మేంద్రియములను నడుపుచుండునో, వాడే యుత్తముడు. 3–7

నియతం కురుకర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాఽపి చ తే నప్రసిద్ధ్యే దకర్మణః॥

విధింపబడిన పనులను చేయుము. పనులను చేయకుండుటకంటె చేయుటయే యుత్తమము. కర్మమును చేయకుండిన నీశరీరయాత్రయు నీకు సులభము కాచాలదు. 3–8

యజ్ఞార్థాత్ కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః,
తదర్థం కర్మకౌంతేయ ముక్తసంగ స్సమాచర॥

యజ్ఞముకొరకు చేయబడు కర్మముతప్ప తక్కిన పనులు మనుష్యులకు బంధనకారులగును. కావున, సంగమును విడిచి, కర్మమును చేసికొనుచుండుము. 3-9

మనస్సున వైరాగ్యబుద్ధి చొచ్చినతోడనే లోకవ్యవహారమును విడుచుటయే మంచిదను మనోభావమున్నది. పురాతనోపదేశము లనేకము లిట్టివియే. కాని, గీత మనస్సు పరిపక్వముగా లేని సన్యాసమును ఖండించి, వేరుమార్గము జూపుచున్నది. ఇదియే గీత గొప్పతనము.

పూర్వకర్మఫలమువలన కొన్ని గుణములతో పుట్టినాము. ఆగుణములను బలాత్కారముగ నడగించుటవలన నుపయోగము లేదు. మనస్సుపక్వము కాకుండునపుడు సహజగుణములను వెలిపుచ్చక యడచుట కారంభించినయెడల, అవి లోపలనే తమకార్యము నాచరించుకొనుచునే యుండును. కామక్రోధాది వేగములు మనస్సును కలత పెట్టుచునే యుండును. పైకి శుద్ధముగను, లోపల అశుద్ధముగను నుండినయెడల నెట్టి ప్రయోజనమును లేదు. ఇది యితరులను మోసగించుటయే కాక తన్నను మోసము చేసికొనుటయే యగును. స్వార్థమును విడిచి నిష్కామముగ పనిచేయుమార్గమే జన్మాంతర

కర్మముచేత కలిగిన స్వభావగుణములచే జీవుని విడిపించుకొను మార్గమగును.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తా హ మితి మన్యతే.

ప్రకృతివలనబుట్టిన గుణములు అన్ని కర్మలకు కారణము. అయితే అహంకారభావముచే గలిగిన మోహము చేత తానే చేయువాడ ననుకొనును. 3-27

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః,
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే.

గుణము, కర్మము, వీని విభాగములను దెలిసినవాడు గుణములు గుణములలో తిరుగుచున్నవని తెలిసి, వానినుండి ప్రత్యేకముగ నుండును. 3-28

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి.

జ్ఞానవంతుడుకూడ తన ప్రకృతి ననుసరించియే నడచుకొనును. ప్రాణులన్నియు ప్రకృతిని వెంబడించి నడచుచున్నవి. నిగ్రహమువలన ప్రయోజనము లేదు. 3-33

# కర్మ యోగము, జీవనస్థితి.

## (గీత: అధ్యాయము 3.)

కారణమున్నను లేకున్నను లోకసంగ్రహమున కైనను మనము కర్మమును చేసియే తీరవలెను. లోకస్థితికి కావలసిన కర్మము నెన్నడును విడువగూడదని భగవంతుడు గీతలో నిట్లొత్తి చెప్పియున్నాడు. నీవు జీవితమును విడిచినచో నితరులును నదే మార్గము ననుసరింతురు. నీవు దేనినిమంచిదని తలంచెదవో యదియే యితరులకును ప్రమాణమగును. నీవు మట్టుకు సన్యాసివై యితరులు లోకవ్యవహారమును నడపుదు రని యెదురుచూడ గూడదు. కావున లోకహితము కొరకు జ్ఞానమునొందిన వాడును కర్మములను జేయవలెనునది సిద్ధాంతము. గీతయనునది లోకవ్యవహారమును బాగుగ గమనించి చేయబడిన ధర్మోపదేశము. "చాల గొప్పజ్ఞానియైన జనకుడు మొదలగువారే కర్మమార్గము ననుష్ఠించియున్నారని చెప్పగా, నీకు వేరుమార్గముండునా?" అన్నాడు భగవంతుడు.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి.

జనకుడు మొదలగువారు కర్మము నాచరించియే సిద్ధిని పొందిరి. లోకవ్యవహారము చక్కగా జరుగుటకైనను నీవు నీకర్మము నాచరించుటయే తగినమార్గము. 3–20

యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే.

దేనిని శ్రేష్ఠుడైనవాడు చేయునో దానినే తక్కిన జనులు ననుసరించి చేయుదురు. అతడు దేనిని ప్రమాణముగ చేయునో దానినే లోకులనుసరింతురు. 3–21

సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వంతి భారత
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోక సంగ్రహం.

మూఢులు ఫలము నాసించి యెట్లు సంగముతో పనిని చేయుదురో, అట్లే జ్ఞానియు నిస్సంగియై లోకపు మేలు తలంచి తన పనిని గూడ నుత్సాహముతో జేయువలెను. 25

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్.

ఆశతోగూడి పనిచేయు అజ్ఞానులకు జ్ఞానియైన వాడు బుద్ధిభేదమును కలిగింపకూడదు. తాను యోగమార్గమున నిలిచి పనిచేయుచు నితరులు గూడ నెల్ల పనులందును ఆశక్తితోచేయునట్లు నడువ వలెను. 3–26

ప్రకృతే ర్గుణ సమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు,
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్.

ప్రకృతిగుణముల మాయకు లోనైనవారు గుణకర్మములయందు తగులుకొందురు. బాగుగ దెలిసిన జ్ఞాని యల్పజ్ఞానముగల యామూఢులబుద్ధి చలించునట్లు చేయకూడదు. 3-29

# 18.

## మనోసాధన.

(గీత: అధ్యాయములు. 2,3,16,18.)

ఇట్లు గీతలో చేయబడిన యుపదేశముచే లోకజీవనమునువిడువ మనస్సులేనివారి కొకవిధమగు సమాధానముగనో, యుపశమన రూపముగనో యుండవలెనని చేయబడిన యుక్తిమాటకాదు. నిజముగా నందరు పురుషులును, స్త్రీలును బాలురును తమజీవితము నీమార్గమున నడపి, యేకర్మమునైనను స్వార్థపరత్వములేక, జనసమూహము మేలుకొరకే. మనస్సు స్వాధీనముచే అభ్యాసము చేసికొనుటను గూర్చి గీతయం దుపదేశము చేయబడినది. చేయగా చేయగా నేదియు నొకనికి స్వభావమై తీరును. సంగము లేక కర్మము చేయుటయు నిట్లే యభ్యాసమైనయెడల స్వభావ మగును.

చేయు కర్మమును బాగుగ కొనసాగించుటకు నిదియే మార్గమగును. సంగమును కామమును మనస్సున కళవరమును భయమును బుట్టించును. జయాపజయముల చింతచేత బుద్ధియొక్క చురుకుతనము తక్కువయగును. కావున, నిస్సంగియై స్వార్థమును విడిచి, కర్మమును చేయుటే కర్మములను బాగుగ కొనసాగించు మార్గము. నీటిలో నీదుబాతు నీటిని

విడిచి వెలికిరాగానే తన రెక్కలతో సులభముగా నీటిని దులిపివేసికొన్నట్లే, కర్మము చేయునపుడు ధర్మదృష్టిని కలిగి కార్యము తీరినపిదప నభిమానమును జయాపజయముల చింతను విడువ వలెను. లోకవ్యవహారమున పనిచేయుకాలమున, గమనికయు, చురుకును, సామర్థ్యమును నితరులకుండుట సాధ్యముకాదని చూచినవారు తలచునట్లు ప్రవర్తించి శుభ్రముగను, చురుకుగను పనులను చేయవలెను. పని ముగిసిన పిదప దానిఫలమును గూర్చిన చింతనే విడువ వలయును. ఈస్థానమును బొందుటకు ప్రయత్నము కావలెను. ముఖ్యముగా మనోవేగముల నడంచు మార్గము నభ్యసింప వలెను.

మనశ్శాంతికి శత్రువులు కామము క్రోధము లోభము అనునవి. ఈ కర్మయోగమునకు కావలసిన మన శ్శుద్ధియు, నిస్సంగత్వమును పొందుట కీ శత్రువుల కెడమి వ్వక యెప్పుడును జాగ్రత్తగ మనస్సును కాపాడవలెను. మన స్సును సరిగ కాపాడినయెడల తక్కినదంతయుసులభమగును. మంచిచెడ్డలు రెంటికిని మనస్సన చొచ్చుతలపులేకారణము. మనస్సు నడచియుంచక విచ్చలవిడిగపోనిచ్చినయెడల, నిశ్చ యముగ నవి పెచ్చుపెరుగును. కోరికలను కామమనె భావ మును కోటలో ప్రవేశపెట్టినయెడల నవి పిదప బాగుగ మన లను లోబరచుకొనుచు ఇంద్రియములలో నివాస మేర్పరుచు

కొని, మనస్సు నావరించి, బుద్ధిని చెరిచి యాత్మను కోతిలో త్రోయును. కావున, కోటవాకిలిని బలముగ మూసి యుంచవలెను. చెడ్డయాలోచనలను, యలక్ష్యము చేయక బయటనే యుంచవలెను.

అర్జున ఉవాచ.

అథ కేన ప్రయుక్తో యం పాపం చరతి పూరుషః
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః.

అర్జును డడుగుచున్నాడు: పాపముచేయు నిచ్ఛలేకున్నను మనుష్యుని ప్రేరేపించి పాపమునందు చొరచేయునదేది? 3-36

శ్రీభగవా నువాచ.

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా, విద్ధ్యేన మిహ వైరిణం.

శ్రీభగవంతుడు చెప్పుచున్నాడు: "అది రజోగుణము నుండి పుట్టుచున్నది. అదే కామము. అదే క్రోధము. అదే సమూలము తినివేయునది. మిక్కిలిగ పాపమును గురిచేయునది. జీవితమునకు శత్రు విదియే యని తెలిసికొనుము. 3-37

ధూమే నావ్రియతే వహ్ని ర్యథాదర్శో మలేన చ,
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేదమావృతం.

అగ్ని పొగచేత చుట్టబడినట్లును, అద్దము మకిలిచేత నావరింపబడి యున్నట్లును, గర్భము మావిచే నావరింపబడి యున్నట్లును దీనిచే జ్ఞానము నావరింప బడును. 3-38

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేనచ.

జ్ఞానికి నిత్యవైరియైన యిది యెన్నికట్టెలు వేసినను తృప్తిపొందక మరింత ప్రజ్వలించు నగ్నివలెనున్నది. ఇది జ్ఞానమును చుట్టుకొని దానిని చెరుచుచున్నది. 3-39

ఇంద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతైర్వి మోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినం.

ఇంద్రియములును, మనస్సును, బుద్ధియు, దీని యునికి పట్లని చెప్పబడుచున్నవి. వీనిగొని యిది జ్ఞానమును చుట్టు కొని జీవుని కే మరుపాటు కలిగించును. 3-40

తస్మా త్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనం.

కావున మొదటనే యింద్రియములను కాచికొని, జ్ఞానమును వివేకమును నాశనముచేయు నీక్రూర శత్రువును చంపుము. 3-41

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథాలోభ స్తస్మా దేత త్త్రయంత్యజేత్.

ఆత్మనాశమునకు కారణమయిన, కామము, క్రోధము, లోభము నయిన యీ మూడును నరకమునకు ద్వారములు. కాబట్టి యీ మూటినిగూడ విడువుము. 16-21

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభిర్నరః
ఆచరత్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాంగతిం.

ఈ మూడు చీకటి ద్వారములనుండి తప్పించుకొనిన వాడు తన యాత్మశ్రేయస్సును వెదకికొనగలడు. దాని మూలమున పరగతిని బొందును. 16-22

యతతోహ్యపికౌంతేయ పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభంమనః.

జ్ఞానమను తపశ్చర్యను గలవాని మనస్సునుగూడ ఇంద్రియములు బలవంతముగ నాకర్షించును. 2-60

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీతమత్పరః
వశేహియస్యేన్ద్రియాణి తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా.

వాని నన్నిటిని బాగుగ నడచి, యోగమున నెలకొని, మనస్సును నాయందేయుంచి, యింద్రియములను వశముచేసి కొన్నవానినే నిశ్చితమైన జ్ఞానము గలవానినిగా తలప వలెను. 2-61

ధ్యాయతో విషయాన్ పుంసస్సంగ స్తేషూప జాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.

మనుష్యుడు విషయములను ధ్యానించునప్పుడు వాని తో నతనికి తగులుబాటు కలుగును. ఆసంగమువలన కామము, కామమువలన క్రోధము పుట్టును. 2-62

క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి.

క్రోధమువలన మోహమును, మోహమువలన మరపును, మరపువలన బుద్ధినాశము. దానివలన మనుష్యుడు నశించును. 2-63

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే
త దస్య హరతి ప్రజ్ఞామ్ వాయుర్నావమి వాంభసి.

ఒకని యింద్రియములు బయటికి చరించునపు డతని మనస్సును వాని వెంబడినే చలించును. సముద్రములో గాలిచే త్తరించు నోడవలె వానిమతియు సంచలించును. 2-67

మొదట ఆశయును మనస్సంతోషమును అమృతము వలె కనిపించును. పిదప విషమేయగును. ఇవి మనుష్యునికి నిజముగ సుఖమును తేజాలవు. దుఃఖముతోనే అవి సమాప్తి నొందును. ఇంద్రియములను మనస్సును నడచుట మొదట విషమువలె కనబడును. కాని ఆమందే పిదప జ్ఞానముచే గలిగిన యమృతమునుబోలిన సుఖానందమును తెచ్చును.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తంచ నిగచ్ఛతి.

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజం.

ఏది మనుష్యుని కభ్యాసమువలన మనస్సున సుఖము నిచ్చి దేనిలో దుఃఖము నిజముగా నంతమునొందునో. 18-36

ఏది మొదట విషమునుబోలునో, తుదకు అమృతమును బోలునో, ఆసుఖమే సాత్త్వికమైనది. ఆసుఖ మాత్మజ్ఞానమందు నెలకొనియుండుటచేత గలుగును. 18-37

(19)

## ధ్యానము.

(గీత : అధ్యాయములు 2, 5, 6, 12, 14.)

తాను చేయవలసిన కర్మములలో తన యింద్రియ సుఖములను కోరక, పనిని చేయుట కలవాటు పడినపిమ్మట నొకమెట్టు పైకి పోవచ్చును. కర్మమును చేయుటయే తన పనియు నధికారమునని తెలిసి, దాని పరిణామమునుగూర్చి కలవరింపక, దాని ఫలిత మేమైనను దానికై సంతోషించుట దుఃఖించుటయు మానుటకు ప్రయత్నింపవలెను. చేసినపనిలో జయమైనను, అపజయమైనను, మనస్సున కలత నొంద గూడదు. సుఖమును, దుఃఖమును, సమముగా భావింప

వలెను. అనగా, సుఖము నిచ్చుసందర్భము లేర్పడినను, దుఃఖము నిచ్చుసందర్భములు వచ్చినను మనస్సునకు స్థైర్యము గలుగున ట్లభ్యాసము చేసికొనవలెను. ఒకసుఖము కలుగక ముందు దానికొరకు నిరీక్షించుచు మనస్సున పొంగుటయు, కలిగి అంతరించినపిదప దానిని దలచితలచి దుఃఖపడుటయు, ఇదియేసుఖదుఃఖముల రాకపోకల యెడ తెగని వ్యవహారము. సుఖమును దుఃఖమును నొకదానిని విడిచి మరియొకటి యుండ చాలదు. రెండును జతగనే యొకదాని వెనుక రెండవది వచ్చు చుండును, దుఃఖమే లేకుండిన సుఖమే దుఃఖమగును. ఈ సుఖదుఃఖములు రెండును విషయములతోడి సంగమువలన గలుగుటచేత క్షణమాత్రముండి మరుచటిక్షణము పోవు మనో భావములేకాని వేరుకావు. ఇవి యాత్మను తాకజాలవు. బయటినుండి వచ్చు నేసుఖమును, దుఃఖమును, నాత్మకొక భాగ్యము నివ్వజాలవు. తనలో జనించు కోరికలే, తాను చేయుచేతలే తనయాత్మ ముందుకు పోవుటకును, వెనుకకు తగ్గుటకును కారణములు; వేరేదియు కాదు.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత.

చలియు, వేడియు, సుఖమును, దుఃఖమును, కలిగించు అణువుల స్పర్శములవలన వచ్చుచుండును, పోవు

చుండును; అవి యనిత్యములు. వానిని సహించుకొనుము. 2-14

యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ
సమదుఃఖ సుఖంధీరం సోఽమృత త్వాయకల్పతే.

ఎవడు వీనిచే దుఃఖము నొందక, సుఖమును దుఃఖము నొక్కటిగ తలంచునో, ఆధీరు డమృతత్వమును పొందిన వాడని తలంపవచ్చును. 2-15

సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి.

సుఖము, దుఃఖము, లాభము, నష్టము, జయము, అపజయము వీనిని సమముగాగొని యుద్ధమునకు తొడంగుము ఇట్లు కర్మమును చేసినయెడల పాపమును పొందవు. 2-38

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః.

విషయముల సంగముచే కలుగు సుఖములు, దుఃఖములకు కారణములే. ఆసుఖములకు మొదలును తుదియు కలవు. జ్ఞాని వానిలో రమింపడు. 5-22

శక్నో తీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యు క్త స్ససుఖీనరః.

శరీరమును విడుచుటకు ముందీ లోకములోనే కామ

క్రోధములచే గల్గుగు వేగము నెవడు సహింప శక్తుడగునో వాడే యోగి; వాడే సుఖమును పొందతగినవాడు. 5-23

మనస్సున పరిశాంతి నొందినచో నదియే పరమానందము. పరమపదమున బొందదగిన సుఖమున కొకవేళ సమమని చెప్పతగినదియు నీలోకములోనే పొందదగినదియు ఈశాంతమే.

యోఽంతస్సుఖోఽంతరారామ స్తథాఽంతర్జ్యోతి రేవయః
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి.

బాహ్యవిషయములను తాకక, తనలోనే సుఖము గలవాడై తనలోనే శాంతిని పొందినవాడై, తనలోనే జ్యోతితో గూడినవాడైన యోగి బ్రహ్మపదమును బొంది, బ్రహ్మనిర్వాణమును పొందుచున్నాడు. 5-24

కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసాం
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనాం.

కామమును క్రోధమును విడిచి, చిత్తమును కట్టుబాటు చేసికొనిన యాత్మజ్ఞానులకు బ్రహ్మనిర్వాణము సమీపముననే యుండును. 5-26

యతేంద్రియ మనోబుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త యేవ సః.

ఇంద్రియములను మనస్సును బుద్ధిని కట్టి, మోక్షము నలవాటుగా లక్ష్యమందుంచుకొని, ఆశ, భయము, క్రోధము వీనిని విడిచిన ముని ముక్తుడే యగును. 5-28

ఏ కార్యము చేసినను దానిని స్వార్థము లేక చేయుటను బాగుగ నభ్యసించి దానినే స్వభావముగ చేసికొనినయెడల పిదప మనస్సు పక్వమగును. ఆపై కర్మము లే ఫలము నిచ్చినను శాంతి చెడక నిలుచుటకు శక్తియుండును. ఆశను, ఆసక్తిని విడిచిన గాని యిది కుదురదు. నిజమైన సుఖ మంతరాత్మ యందుండు సుఖమే. ఇంద్రియములవలన కలుగు సుఖ భోగము లాత్మసుఖమును తేచాలవని బాగుగ గ్రహింపవలెను.

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే.

యోగమార్గమున పైకి పోగోరుమునికి కర్మమే సాధనమని చెప్పబడినది. యోగమార్గమున పైకెక్కిన పిదప దాని వలన కలుగు శాంతము వానికి సాధనమగునని చెప్పబడినది. 6-3

యదా హి చేంద్రియార్థేషు నకర్మ స్వనుషజ్జతే
సర్వ సంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే.

ఒక డెల్లసంకల్పములను విడిచి యింద్రియ విషయము లందును, కర్మములందును, ఆసక్తి లేనివాడై యుండుటచేతనే

వాడు యోగమార్గమున పైకెక్కినవాడనబడును. 6-4

ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాఽఽత్మానమవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః.

తనయాత్మచేత తన్నుద్ధరించుకొనవలెను. ఆత్మను చెరుచుకొనగూడదు. తనకు తనయాత్మయే బంధువు. ఆత్మయే తనకు పగవాడును అగును. 6-5

బంధురాత్మాఽఽత్మనస్తస్య యేనాఽఽత్మైవాఽఽత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాఽఽత్మైవ శత్రువత్.

తన్ను తాగెలిచినవానికే తనయాత్మ బంధువగును. తన్ను తాగెలువని వానికి తనయాత్మయే పగవాడై చెరుచును. 6-6

జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః.

తన్ను తాగెలిచి ప్రశాంతినొందినవాని యుత్తమమైన యాత్మ శీతోష్ణములందును, సుఖదుఃఖములందును, మానావమానములందును సమత్వమును బొంది వెలయును. 6-7

సుఖములందును దుఃఖములందును మనస్సు కలత నొందక సమత్వమును బొందుటకు ధ్యానమావశ్యకము. కర్మయోగమభ్యాసము చేయునపుడు అనగా తనకేర్పడ్డ పనులను స్వార్థమును విడిచి కర్మపరిణామమును గూర్చి చింత

గొనక మనోవికారమునుబొందక యుండుటకు అలవాటు చేయునపుడు, ఏకాంతముననుండి చిత్తమాలిన్యములను విడిచి, ధ్యానములో నిలుచుటచే మనస్సునకు స్థిరత్వము గలుగును. ఇట్టిధ్యానమునభ్యసించుట క్రింద చూపిన శ్లోకములలో 'యోగ' మని చెప్పబడుచున్నది.

యోగీ యుంజీత సతత మాత్మానం రహసిస్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః.

నిర్జన ప్రదేశమున ఏకాంతముగనుండి, మనస్సును ఎల్లప్పుడు వశముచేసికొని ఆశను, వస్తువులను సంపాదింపవలె ననుకోరికను విడిచి యోగము నభ్యసించుచుండవలెను. 6–10.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్.

శుద్ధమైనస్థలములో నెక్కువ యెత్తుగ గాని, మిక్కిలి క్రిందుగగాని యుండని యొక స్థిరమైనయాసనము నేర్పరచుకొని బట్ట, జింకతోలు, దర్భ వీనిని పరచుకొని కూర్చుండవలెను. 6–11.

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియ క్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మ విశుద్ధయే.

మనస్సు నొక ముఖమునకు దెచ్చి, మనస్సును, నింద్రియములును చేయుపనులను స్వాధీనమునందుంచుకొని,

యాసనమునందు గూర్చుండి, యాత్మశుద్ధి యగునట్లు యోగమునందే నిలువవలెను. 6-12.

సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చా నవలోకయన్.

శరీరమును, తలను, కంఠమును సమముగా నుంచుకొని స్థిరత్వమునొందినవాడై, తన ముక్కు కొనయందు దృష్టిని నిలిపికొని, యిటునటు చుట్టును చూడకయుండవలెను. 6-13.

ప్రశాన్తాత్మా విగత భీర్బ్రహ్మచారివ్రతే స్థితః
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః.

ప్రశాంతముపొందినపిదప, భయమనుదానిని పొందక, బ్రహ్మచర్యవ్రతమున నెలకొని, మనస్సునడచి, నాయందు చిత్తమునునిలిపి, నన్ను బొందిన యోగమునునుండవలెను. 6-14.

నాత్యశ్నతస్తు యోగోఽస్తినచైకాంత మనశ్నతః
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున.

ఎక్కువగా తినువానికి యోగములేదు. ఎక్కువగా ఉపవాసములు చేసినను ఫలములేదు. మిక్కిలిగ నిద్రపోవు వానికిని యోగము కలుగదు. అట్లే నిద్రను విడిచినను ఫలము లేదు. 6-16.

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా.

నియమమునకు లోబడిన యాహారమును విహారమును కర్మములచేయుటయందు నియమమునకు లోబడిన క్రియ మున్ను నియతమైన నిద్రయును మెలకువయు గలవాడే దుఃఖ నాశకమగు యోగమార్గమును బొందును. 6-17.

యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః.

చిత్తమునుకట్టి యాత్మయోగమున నిలిచినయోగికి గాలి లేనిచోట చలింపక నిలచు దీపము సమానమని వచించిరి. 6-19.

ఏవిషయమందును మితిమీరిపోకూడదనిగీత దృఢము చేయుచున్నది. యోగసిద్ధికి ముఖ్యమైనసాధనము మనస్సును కాపాడుట. మనస్సు ఎప్పుడును పరుగెత్త చూచుచుండును. మనస్సునసుద్భవమగు తలపుల నడంచనియెడలనవి మనస్సు నావరించుకొని పరుగెత్తించును. ఎప్పుడును గట్టిగాపట్టు కొనియే యుండవలెను.

ఎంతప్రయత్నము చేసినను మరలమరల యోచనలు కలుగును. దానిని చూచి భయపడక అప్పుడప్పుడే మనస్సును స్థిరపరుచుకొని, పరమాత్మ చింతయందు నిలుపవలెను.

సంకల్ప ప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమన్తతః

మనస్సుచేత తలపులనుండి జనించు ఆశల నన్నిటిని పూర్తిగ విడిచి, విషయములనుండి యింద్రియములు దూరముగ నుండునట్లు కట్టియుంచి, 6-24

శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా
ఆత్మ సంస్థం మనః కృత్వా నకించిదపి చింతయేత్.

స్థిరబుద్ధితో మనస్సు ఆత్మయందు నిలిపి, రాను రాను దానియందే లీనమగునట్లభ్యాసము చేయవలెను. ఎట్టి చింతయు లేక యుండవలెను. 6-25

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం నయేత్.

మనస్సు చంచలమై, స్థిరముగ నిలువక చలించునప్పుడెల్ల దాని నడచియుంచి, యాత్మకు వశమునం దుంచవలెను. 6-26

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్.

మనస్సు శాంతముగా, రజోగుణ మడగి, కల్మషమును విడిచి, బ్రహ్మపదము నొందిన యోగికి ఉత్తమసుఖము లభించును. 6-27

• మనస్సు కుదిరికగొన్నవాడెట్లుండుననుదానిని క్రింద చూడవచ్చును.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణఏవ చ
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ.
సంతుష్ట స్సతతంయోగీ యతాత్మా ధృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధి ర్యోమద్భక్త స్సమే ప్రియః.

ఏప్రాణియెడలను పగనువిడిచి, స్నేహమును కరుణయు గలవాడయి, నేననియు నాదనియు అనక, సుఖమును దుఃఖమును సమముగా చూచి, 12-13

ఎప్పుడును మనస్సంతోషము గలవాడై మనస్సును స్వాధీనమందుంచుకొన్నవాడై, దృఢనిశ్చయము గలవాడై, నాయందే మనస్సును బుద్ధిని అర్పణముచేసిన యోగి నా భక్తుడు నాకిష్టుడు. 12-14

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతేచ యః
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో యస్సచ మేప్రియః.

ఎవనికి లోకులు వెరవరో, లోకుల కెవడు వెరవడో, హర్షము, మాత్సర్యము, భయము నను వేగములనుండి యెవడు విడబడియుండునో, వాడే నా కిష్టుడు. 12-15

అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభపరిత్యాగీ యోమద్భక్త స్సమేప్రియః.

దేనినైనను కోరి ఫలమునకు యెదురుచూడక, శుచియై, నేర్పరియై, పట్టుదలలేనివాడై, కలతను విడిచినవాడై, ఎల్ల

కార్యముల యారంభమునందును ఫలాశనువిడిచి, నాయెడ భక్తిగలవాడే నా కిష్టుడు. 12-16

యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్సమేప్రియః.

ఎక్కువ సంతోషము నొందక, పగ బూనక, దుఃఖింపక, ఆశగొనక, మేలును, కీడునుగూడ విడిచి, భక్తిగలవాడే నాకిష్టుడు. 12-17

సమ శ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః.
తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్
అనికేత స్థిరమతిర్ భక్తిమాన్ మేప్రియో నరః.

పగవానియందును నేస్తగానియందును, మానమునందును అవమానమునందును, చలియందును వేడియందును, సుఖమునందును, దుఃఖమునందును, సమముగా నుండి, సంగమును విడిచి, 12-18

పొగడ్తయు నిందయు సమముగా చూచి మాటాడక, యేమివచ్చినను దానితో సంతోషపడి, తన యిల్లిదియనక, స్థిరబుద్ధితో నుండుభక్తుడు నా కిష్టుడు. 14-19

ఇట్లింద్రియ నిగ్రహామువలనను, నియమములచేతను, ధ్యానముచేతను, పొందిన శాంతినిగూడి పూర్వకర్మఫలముగ

దేహముతో గూడివచ్చు ప్రకృతిగుణములు. దానితో కలిసియే యుండును. జ్ఞానమునొందినపిదపను ఈ చాంచల్యముండును. దానినిగని దుఃఖింప పనిలేదు. అది స్వభావమని తెలిసి, యడుగడుగునకు నిజతత్త్వమును స్మరించి శాంతిని విడువక కాచుకొనవలెను. గుణములను దాటినవా రెవరన :-

ప్రకాశంచ ప్రవృత్తించ మోహ మేవ చ పాండవ
న ద్వేష్టి సంప్రవృత్తానిన నివృత్తాని కాంక్షతి.

మనఃప్రకాశము, పనులను చేయవలెనను ఆసక్తి, మోహము, ఇవిప్రాప్తించినప్పుడు వీనిని చూచి భయపడక, యాస్థితులు తొలగగనే వానిని కోరకయుండువాడు. 14-22.

ఉదాసీనవ దాసీనో గుణైర్యో నవిచాల్యతే
గుణా వర్తన్త ఇత్యేవ యోఽ వతిష్ఠతి నేంగతే.

స్వీయ స్వభావగుణములచేత మనస్సు కలతనొందక యుదాసీనముగా నుండి, 'గుణములు వర్తించుచున్నవి' అని తలచి, యాశను విడిచి నిలుచువాడు. 14-23

సమదుఃఖ సుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మ కాంచనః
తుల్యప్రియాప్రియోధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః.

దుఃఖమును సుఖమును సమముగా గొని, యాత్మ యందు నిలుచువాడు, మంటిబెడ్డనురాతిని బంగారమును సమముగా చూచువాడు, ప్రియము చేయువారియెడలను నప్రియ

ము చేయువారియెడలను సమముగనే నడచువాడు, నిందను పొగడ్తను సమముగా గొను ధీరుడు. 14-24

మానవమానయోస్తుల్య స్తుల్యోమిత్రారిపక్షయోః
సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్సఉచ్యతే.

గౌరవమును అవమానమును సమముగ తలచువాడు, మిత్రులయందును పగవారియందును సమభాగమును పూను వాడు, తనకొరకు పనుల నారంభింపనివాడును, ఇట్టివాడే గుణములనుగడచినవాడని త్రిగుణాతీతుడని చెప్పబడును. 14-25

## 20.

## స్వభావగుణములు.

(గీత: అధ్యాయములు 4, 13, 14, 18.)

మనుష్యుడు తప్పదారి నేలపోవు ననుదానికి కారణము అడుగడుగునకు జ్ఞాపకమునకు తెచ్చికొనవలెను. చెడు పనులను చేయువారిని చూచి శాంతమును విడువక, వారియెడల విశ్వాసము చూపుటయు, మనస్సును కలతనొందింపక దానిని స్థిమితముగ చేసికొనుటయు, మిగుల మంచిది.

తన్నుతా నడచుకొనలేక, మనస్సు నజాగ్రత్తగ పిడిచినయెడల జన్మతోడ స్వాభావికముగ వచ్చు గుణముల

యు(ద్రేకముపనిచేయును. స్వభావమనునదిఅంధరకను వేదనను కలిగించును. అది కార్యరూపమున బయలుబడును. దీనినోకని యందు చూచి మనము కోపింపవచ్చునా? ఇతరుల పనిని చూచి వేసరపడునప్పుడెల్ల వారువారు తమలోని లోపములను జ్ఞాపమునకు తెచ్చుకొనవలెను. నీమనస్సు శుద్ధముగ నున్నదా? ఇతరులకు దెలియునట్లది బయటికి కనబడకపోయినను అది లోపలనే చేయుపనిని నీవు చూచుచునే యుందువు గదా. దానిని నీవడచినయెడల అది నీభాగ్యము. ఇతరులా భాగ్యమును బొందకయుండుటను నీవు విచారపడవలయును. భగవదనుగ్రహమును సంపాదించినయెడల గదా వారి యాత్మ అస్వాభావికమయిన కర్మమునుండి బయటబడగలదు. లోకమున నడచునదంతయు నీశ్వరసంకల్పము. ఏది చెడుగు ఏది మంచి యని నీవు తీర్మానింప వచ్చునా? తుదకేదిచెడుగు, ఏదిమంచి, అనున దీశ్వరునికే తెలియును. జగత్తు విధానమును తెలియని మనము దానిని తీర్మానింప వీలులేదు.

ప్రకృత్యైవ చకర్మాణి క్రియమాణాని సర్వశః
యఃపశ్యతి తథాఽత్మాన మకర్తారం సపశ్యతి.

ఏవిధమునను పనులు పకృతివలననే చేయబడుచుండును. కావున నాత్మయనునది కర్తకాదని కనుగొన్నవాడే తత్త్వమును దెలిసినవాడు. 13-30

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయం.

సత్త్వము, రజస్సు, తమస్సు, ఈ గుణములు ప్రకృతిలో పుట్టును. స్వభావముచేత నాత్మ యవ్యయమైనదైనను దేహమునందు నిలుచునపుడది యీగుణములచే కట్టబడుచున్నది. 14-5

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి.

గుణములు తప్ప వేరే కర్త లేదను దానికి జీవుడు తనుగాని గుణములకు పైనున్న తత్త్వమును దెలిసిన యెడల నా స్వరూపమును తెలిసినవాడగును. 14-19

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్త్రిభిర్గుణైః.

ప్రకృతియందు కనబడు ఈ మూడు గుణములనుండియు విడబడి నిలుచు ప్రాణి భూలోకమునందు లేదు. ఆకాశమునందును దేవతలయందునుకూడ లేదు. 18-40

స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్.

స్వభావముగనుండు కర్మములచే కట్టువడియున్న నీవు మోహము వలన దానిని చేయననినను నీవశము కాకయే నీవు దానిని చేయుదువు. 18-60

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.

ప్రభువు అనే జీవుడు కర్మను, కర్మఫలము, వీనిలో దేనిని సృజింపడు. ప్రకృతిస్వభావము చేతనే యంతయును నడచును. 5-14

నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః
అజ్ఞానేనాఽవృతం జ్ఞానం తేన ముహ్యంతిజంతవః.

జ్ఞానమనునది అజ్ఞానముచే చుట్టబడియుండినందున జీవులు మోహమునొందుదురు. ప్రకాశమునొందిన యాత్మ యేదైన చెడుపనినిగాని మంచిదనబడుదానినిగాని యంటి యుండదు. 5-15

అనాదిత్వా న్నిర్గుణత్వాత్ పరమాత్మాఽయ మవ్యయః
శరీరస్థోఽపి కౌన్తేయ నకరోతి నలిప్యతే.

ఆదియనునది లేక, గుణమును లేక, యిట్లు మార్పు లేక పరమాత్మ దేహమందున్నను అది యేపనిని చేయకయు, పని నంటకయు నుండును. 13-32

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.

ఎల్లప్రాణులలోను నీశ్వరుడున్నాడు. మాయాబలము

చేత నీశ్వరు డెల్లజీవులను చక్రములందు తిరుగు ప్రతిమవలె త్రిప్పును. 18-61

ఈ శ్లోకమువలన నేమి తెలిసికొంటిమి? పుట్టినప్పుడు ఏగుణములతో పుట్టితిమో యవి మనలను ప్రేరేపించును. పాపముచేసినాడని యొకనిని ద్వేషింపకూడదు. హేళనయు చేయకూడదు. మనమా పాపమును చేయలేదని గర్వపడను కూడదు.

ఈ శ్లోకములను గ్రహించి మన కెట్టిబాధ్యతయు లేదని చెప్పకూడదు. అంతయును పుట్టుగుణమని విడిచి యెట్టిబాధ్యతయు లేక నడచుకొనుటకీశ్లోకములు ప్రమాణమని భావించుట మూఢత్వమగును. ఆత్మశక్తిచే స్వభావగుణములను, అనగా తాను పూర్వజన్మమున చేసినకర్మలఫలముగా సంపాదించిన స్వభావగుణములను వశముచేసికొనవలెను. వాని నడచి గెలిచి విడుదలపొందవలెను. స్వభావగుణములను గూర్చి గీతయందు చెప్పబడిన శ్లోకములెల్ల నితరులను విశ్వాసముతో చూచుటకును తనలో మనస్సున కళవళము నొందక యుండుటకును సాధనముగ సత్యము నెత్తి చూపుటకును తప్ప, నొకొక్కడును దనవిషయమున బాధ్యతను తప్పించుకొని ప్రయత్నముచేయక చెడిపోవుటకుగాదు.

ఈ యుపదేశ మితరులను చూచి వీరు పూర్వకర్మము

నకు ఫలమని నీచకులము లేక నీచగుణము గలవారని నీచముగా జూచి, క్రూరముగాను, అసూయతోను, గర్వముతోను, నడచుకొనుట కాధారము కాను. అట్లెవడైన నడచినయెడల తన యాత్మను నీచపరుచుకొన్నవాడగును.

ఆత్మ దేనిచేతను మారదు. అది ప్రత్యేకముగ నిలిచియుండును. ప్రకృతిగుణములే యెల్లచేష్టలను చేయుచున్నవి. ఆచేష్టలచేత ఆత్మ మార్పుదల నొందదు. దాని స్వరూపమును స్పష్టము చేయుటకు చెప్పినది. పాలలో మజ్జిగ వేసినయెడల పెరుగగునట్లు, దేహముతో చేరిన యాత్మస్వరూపము పాపపుణ్యములచేత మారిపోదు. "ప్రత్యేకముగా నిలుచును" "మార్పుదల పొందదు" అనుదానివలన దెలియవలసిన దింతేకాని, యాత్మకు బాధ్యతలేదని చెప్పుట కాదు. చేయుపనుల పాపపుణ్యఫలము నది పొందదనియు కాదు.

స్వభావగుణములు జడప్రకృతియైన దేహమున నాటుకొని యున్నను నవి యింద్రియములను మనస్సును తమయధీనమున నుంచుకొని, వానిమార్గమున నాత్మనుగూడ బంధించి విడుచును. కాని, గుణములతో పోరాడి, గెలిచి, బంధమునుండి తప్పించుకొనుట కాత్మకు శక్తియు స్వాతంత్ర్యమునున్నవి. దీనికి జ్ఞానమను సాధనము కావలెను.

జ్ఞానమనునది కేవల గ్రంథపఠనమువలనను, ధ్యానమువలనను రాదు. సత్యమైన జిజ్ఞాసయే జ్ఞానము. ప్రయోజనకారి యగునట్లు సరియైన తత్త్వవిచారము పొందగోరిన యెడల నింద్రియములను, మనస్సును, కర్మములను నడచి, వశపరుచు కొనవలెను. ఇట్లడపనియెడల పొందిన జ్ఞానము లోపల జొచ్చి, యాత్మకు సహాయపడదు. నూనెమీద నీరు విడిచిన మాదిరిగ ఫలకారి కాకుండబోవును. సత్యమయిన జ్ఞానమును బొందక, కర్మములను మనస్సును నడచి వశపరుచుకొనక, స్వభావగుణములను యథేచ్ఛముగ తమ పనులను చేయవిడచినయెడల కర్మభారము వృద్ధి యగుచునే పోవును. ✓

## 21.

## అందరకును మోక్షము.

(గీత: అధ్యాయములు 4, 7, 9)

మహాపాపము చేసినవాడయినను, 'నాకేదిగతి?' యని యెవడును నిరాశను పడనక్కరలేదు. వానికిగూడ తా చేసిన పాపమునుగూర్చి దుఃఖపడి భగవంతుని శరణుజొచ్చినయెడల విడుదలయున్నది. ఇది గీతలోని దృఢమైన బోధన.

ఇదేమి? కర్మబంధము నింత సులభముగ తప్పించు కొన వీలున్నదా యని సందేహపడనక్కరలేదు. చేసిన పాప కార్యమును గురించి, స్మరించుచు పాపపు తలపులను గురించి నిజమైన పశ్చాత్తాపము నొంది, మనస్సును త్రిప్పుకొన్నయెడల నదియు నొకకర్మమే యగును. దాని ఫలమును కూడ ఆత్మపొందును. కావున, భగవంతుని శరణుజొచ్చిన యెడల కర్మభారము తొలగిపోవుననుట కర్మవిధికి విరుద్ధము కాదు.

కాని తరువాత మంత్రములను చదివి ప్రాయశ్చిత్తము చేసికొనవచ్చునని తలంచి పాపకార్యము చేసినయెడల తప్పించుకొన వీలులేదు. నిజముగా మనస్సును త్రిప్పుకొనని యెడల పాపము పోదు. కావలెనని చేసినవారి కిట్టి నిజమైన పశ్చాత్తాపము రానేరదు. తాచేసిన పాపమునకు తగినంత పశ్చాత్తాపపడిన నా పశ్చాత్తాపమే వానికి గొప్ప కష్టమును దుఃఖమును తెచ్చి, ఇతరులు విధించు దండనకంటె నెక్కువ దండన యగును. అట్టి క్లేశము ననుభవించిన, తన్ను తానే శుద్ధిచేసికొనుట యగును. కాని, యెంతదూరము నిజముగ క్లేశపడుదుమో, అసగా మనమే దుఃఖమునొంది దండించు కొందుమో, అంతమట్టుకు మున్ను చేసినపాపమునుండి తప్పి కొందుము.

పశ్చాత్తాపపడుటయు, భగవంతుని శరణుజొచ్చు టయు, అంతరాత్మ వేగము నే తప్ప, వేరుమంత్రము గాని, మాట గాని, జపము గాని, స్మార్తక్రియగాని పనిలేదు. పురోహితుడో, గురువో చెప్పు మంత్రము చేతనే ప్రాయశ్చి త్తము కాచాలదు. మంత్రమును, క్రియయు, పురోహితు డును, గురువును ఉపయోగపడక పోరు. పునీతులగుటకు ఋషులును పూర్వులును నుపయోగించినపదములును, కార్య ములును, సంకేతములు ను మనమును నుపయోగించినయెడల మంచి తలపులను, ధైర్యమును, భక్తియు కుదురును. ఇతరు లకు తెలియునట్లు చేయు క్రియలవలన చేసిన పాపమును గూర్చి సిగ్గునుగల్గును, ఇవన్నియు మనస్సును పునీతముచేయ కలుగు సాధనలు. ఇంతేతప్ప దానిని గాని సత్యము నేమర కూడదు. ఒకవేళ నితరుల నేమరింప వచ్చును. తన్ను మోసముచేసికొనవచ్చును. కాని సత్యము నేవిధమునైనను నేమరకూడదు. కర్మవిధి యనునది సత్యస్వరూపమే. కావున దానినేమరగూడదు. ఒక వర్తకుడు తప్పు త్రాసుతోనో, తప్పుకొలతతోనో జనులను మోసపుచ్చవచ్చునుకాని, యే వ్యాపారియుతనలెఖ్ఖలోనే మోసముచేసికొనడు. వైద్యుడు రోగియెడల అసత్యము పలుకవచ్చును. కాని యుష్ణమాపక ధర్మామీటరు అను యంత్రము తప్పు చూపించదుగదా!

ఇతరశాస్త్రపుస్తకములలో నేమిచెప్పియున్నను, భగవంతుని శరణుజొచ్చి విడుదలనొందుటకు జాతిగాని, కులముగాని బాధింపదు. దీనిలో ఆడు, మగయు, వ్యత్యాసము లేదు. దీనికి గీతలో చెప్పబడియున్న శ్లోకములు:

సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తినప్రియః
యే భజన్తితుమాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.

నేనెల్లప్రాణులందును సమముగా నుందును. నే నెవ్వరిని ద్వేషింపను, ప్రేమింపను నన్ను భక్తితో నెవరు భజింతురో వారు నాయం దమరియుందురు. వారిలో నేనుందును. 9-29

అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః.

మిక్కిలి చెడునడత గలవాడయినను వేరుదానియందు మనస్సును పోనీయక, నన్ను భజించినవానిని మంచివాడనియే తలపవలెను. అతని ప్రయత్నము మంచి ప్రయత్నము. 9-30

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి.

అట్టివాడు శీఘ్రముగనే ధర్మాత్ముడగును. నిత్యశాం

తిని పొందును. నిశ్చయముగ తెలిసికొనుము. నా భక్తు డెవ
నికిని నాశములేదు. 9-31

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపియాన్తి పరాంగతిం.

పాపులు నన్ను శరణుజొచ్చినయెడల, స్త్రీలైనను,
వైశ్యులైనను, శూద్రులైనను, పరగతిని పొందుదురు. 9-32

దేవుని భజించువాడేకులమువాడనికాని, మగవాడు
ఆడుది యనికాని యనుట యెట్లు ముఖ్యముకాదో, అట్లే
యెట్లు దేవునారాధించు ననునదియు ముఖ్యముకాదు. ఇది
గీతలో మనము చూచు గొప్పవిషయము. హిందూమతము
నకు గొప్ప కీర్తినితెచ్చువిషయము. భగవంతు ననేకు లనేక
విధముల నారాధింతురు. మతము, సంప్రదాయము, వీనిభే
దములను నేను లెక్కింపనని గీతలో భగవంతుడు స్పష్టముగ
చెప్పియున్నాడు.

యేయథామాంప్రపద్యన్తే తాం స్తథైవభజామ్యహమ్
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః.

ఎవరు నన్నెట్లుభజింతురో వారి నట్లే నే ననుగ్రహిం
తును. మనుష్యు లేమార్గము ననుసరించినను నన్ను పొందు
మార్గమేయగును. 4-11

యేఽప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః
తేఽపిమామేవ కౌంతేయ యజన్త్యవిధిపూర్వకం.

అన్య దేవతలను శ్రద్ధతో భజించు భక్తులను, విధిని తప్పినవారైనను నన్నే యారాధించుచున్నారు. 9-23

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రియతాత్మనః.

ఆకు, పువ్వు, పండు, నీరు ఏదియైనను నాకొకడు భక్తితో నర్పించినయెడల తన్నుతా జయించి యిట్టిభక్తితో నాకిచ్చినదాని నాదరముతో నంగీకరింతును. 9-26

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం.

నీ వేదిచేసినను దేనిని తినినను, నా కర్పణమనియే చేయుము. 9-27

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః
తంతంనియమమాస్థాయ ప్రకృత్యా నియతా స్వయా.

చాల కోరికతో కూడియున్న మనస్సును గలవారు తమతమ ప్రకృతిచేత కట్టబడి, వేర్వేరు నియమములను చేపట్టియుండ, కొందర రన్య దేవతల ననుసరించుచున్నారు. కాని, 7-20

యో యో యాం యాం తనుం భక్తశ్శ్రద్ధయా ర్చితుమిచ్ఛతి
తస్యతస్యాచలాం శ్రద్ధాంతామేవ విదధామ్యహం.

ఏభక్తుడు శ్రద్ధతో నేదేవత నర్చించునో యతనికా దేవతయందు ధృఢమైన భక్తిని నేనే యుంచుదును. 7-21

స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్.

వాడా నమ్మకను బొంది యామార్గముననే యారాధింపకోరును. కోరినవానిని నంతటిని వాడు పొందును. వానినిచ్చువాడను నేనే. 7-22

ఇట్లు మతము నంప్రదాయము, క్రమము, నేవిధము ననున్నను నెల్లమార్గములును భగవంతునే చేరునని గీతలో చెప్పబడినది. ఆకాలమున జనులనుసరించివచ్చిన మతముల మార్గములను సంప్రదాయములనుగూర్చియే చెప్పబడినది. తరువాతవచ్చిన యితరమతములను క్రమములనుగురించి అప్పుడు చెప్పుటకు సాధ్యముకాదుగదా! అయినను, చెప్పిన వాక్యములలో తరువాత వచ్చినమతములను యన్నిటి నుద్దేశించి చెప్పిన మాట యని మనము గ్రహింపవచ్చును. ఎల్లమతముల నంగీకరించియున్న మాణిక్యముల వంటి యీ వాక్యములను మనము గౌరవించి యాచరణలో పెట్టవలెను.

## 22

# నాస్తికము కూడదు.

(గీత : అధ్యాయము 16.)

ఈశ్వరుని చేరుటకు సాధనములయిన యెల్లమతము లను, మార్గములను భగవంతు డంగీకరించునని గీత చెప్పు తూ నాస్తికము లేక అనాత్మవాదమును ఖండించుచున్నది. ఈక్రింది శ్లోకములు నాస్తికవాదమునుగురించి చెప్పుచున్నవి. "ధర్మమనున దేమి ? సత్యమనున దేమి? ఏదిలేదు. మనుష్యులు చేరి, తమ సుఖముకొరకు కేర్పరుచుకొన్న యేర్పాటే ధర్మము" అని యీకాలమున కొందరాడు మాటలనే యివి సూచించు చున్నట్లున్నవి.

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః
నశౌచం నాపిచాచారో నసత్యం తేషు విద్యతే.

అసురత్వము నాశ్రయించినవారికి పనిచేయు క్రమము తెలియదు. పనినుండి విరమించుట కూడ తెలియదు. శౌచము, సదాచారము, సత్యము, అనునవి వారిలో కనపడవు. 16-7

అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరం
అపరస్పరసంభూతం కి మన్య త్కామహైతుకం.

వారు "ఈలోకములో సత్యమను పదార్థము లేదు. లోకము ధర్మముతో ప్రతిష్ఠింపబడి యుండలేదు. పరిపాలించు నీశ్వరుడును లేడు," అనిఅందురు. ఒకటితో నొకటి కలియగా ఆకూడికవలన నెల్లసృష్టియు నగుచున్నదనియు, లోకమునకు కామమే హేతువనియు వారందురు. 16-8

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మనోఽల్పబుద్ధయః
ప్రభవ న్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః

అల్పబుద్ధిగలిగి యాత్మను నాశనము చేసికొనువా రిట్టి చూపుగలవారయి, క్రూరకార్యములను చేసి, లోకమునకు కీడుచేసి, దానినాశమునకు కారణ మగుదురు. 16-9

కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ప్రవర్తన్తేఽశుచివ్రతాః

తృప్తినొందచాలని కామము నాశ్రయించి, డంబమును, గర్వమును, మదమును బొందినవారై, మోహముచే కలుగుతప్పుటభిప్రాయములతో కూడినవారై, యశుద్ధవ్రతములతో నుండువారై వారు ప్రవర్తింతురు. 16-10.

చింతా మపరిమేయాం చ ప్రలయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః

మరణమువరకు తీరని మితిలేనిచింతనుపొంది కామోప

భోగములను తృప్తిపొందించుకొనుటయందే యాసక్తి గలిగి, యిదియే పురుషార్థమని నిశ్చయించుకొని, 16–11.

ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థ సంచయాన్.

వందలకొలది నాశాపాశములచే కట్టువడి, కామమునకును, క్రోధమునకును నాటపట్టులై, కామభోగమునకై యన్యాయముచేయుచు, ధనము మొదలగువస్తువులను చేర్చుకొనకోరుదురు. 16–12.

నేడు లోకమునగల స్థితి యిదియే గదా! ప్రత్యేక మనుష్యులయాశలును, చేతలును, జాతికూటములదృష్టులును, ఇట్లే యుండుచు వచ్చుచున్నవి. ఈశ్వరునిమరచిన నాగరికత మున్ముందెట్లుండు ననుదాని నింకను చూడుడు.

ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథం
ఇదమస్తీ దమపిమే భవిష్యతి పునర్ధనం.
అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహంబలవాన్ సుఖీ.

ఇప్పు డీలాభము నొందితిని. ఇకముం దీలాభమును పొందుదును; ఈవస్తువును పొందితిని, ఇంకను నాకు ధనము లభింపగలదు. 16–13.

ఈపగవానిని చంపితిని. ఇంక నితరులను చంపెదను. నే నీశ్వరుడను, నేను భోగిని, నేను సిద్ధుడను, నేను బలవంతుడను, నేనుసుఖపడుచున్నాను, అని ఇట్లెన్నుచుందురు. 16-14

అనేక చిత్తవిభ్రాంతా మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ.

పలువిధములగు చిత్తవిభ్రాంతి నొంది, మోహమను వలలో చిక్కి, కామభోగములలో తగిలి అశుద్ధమైన నరకమున పడుదురు. 16-16

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యేదాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః.

"నేను పుణ్యవంతుడను. నాకు స్వంతబంధువు లనేకులున్నారు. నాతో సమానమయినవా డెవడున్నాడు? యజ్ఞములను చేయుదును. దానములు చేయుదును. సుఖముల పడయుదును" అనిఇట్లజ్ఞానముచే మోహమునొందుదురు. 16-15

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనా విధిపూర్వకం.

వారు తమ్ముతామే పొగడుకొందురు; వారు పిడివాదముచేయువారు; ధనము, అభిమానము, మదములతోకూడినవారు. డంభమునకు విధి నుల్లంఘించి పేరుకు మాత్రము యజ్ఞములను చేయుదురు. 16-17.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః

అహంకారమును, బలమును, దర్పమును, కామమును క్రోధమునుబొందినవారై, వీరు తమ దేహములలోను, ఇతరుల దేహములలోను, పరమాత్మనై యున్న నన్ను పగతో చూతురు. 16-18.

మోసమును పశుబలమునుఉపయోగించి సంపాదించిన ధనమును, దాని నాశ్రయించిన నాగరికతయు, ప్రతిష్ఠకొరకు మనస్సును తృప్తిపరచుకొనుటకును చేయు దానములును, సార్వజనికోపయోగము లయిన మంచికార్యములును, నీవేవ ములకు పునాదులై నిలుచు నధర్మమును ధర్మముగాచేయసమ ర్థములు కావు. ఇట్టి యనాత్మవాదమును, నాస్తికమును, తుదకు నాశనమునకే మార్గము లగును.

పూర్వులు చూచినసత్యముల నెడపెట్టకూడదు. వారు తాము చేసిన చింతచేతను, నభ్యాసముచేతను, తపస్సుచేతను ధ్యానముచేతను చూచిన సత్యమునుమరచి, మనము మొదటి నుండియు ప్రయత్నించి, మనమే చూడనెంచుట యుచితము కాదు. సంపాదించిన ధనము నుంచుకొని, దానిపై నింకను సంపాదింపకోరుట మనకు కర్తవ్యము. పూర్వులు చూచిన త్యములకు శాస్త్ర మనిపేరు. ఒక్కొక్కడును మరపునొంది

మొదటినుండియు నారంభించుట యనునదీ సాధ్యము కానిపని యగును.

యశ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిం.

శాస్త్రవిధులను బయటికి త్రోసి, కామము ప్రేరించినట్లు నడచువానికి సిద్ధి లేదు; సుఖము లేదు, పరగతియు లేదు. 16-23.

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి.

కావున, నీవు దేనిని చేయవచ్చును, దేనిని విడువవచ్చును, అనువ్యవస్థను తెలుసుకొనుటకు శాస్త్రమునేప్రమాణముగా నుంచుకొనుము. శాస్త్రవిధానమును దెలిసి, నీవు కర్మములనుచేసి జీవితమును గడుపువాడవుగమ్ము. 14-24

## 23.

## గుణ విభాగము.

(గీత: అధ్యాయము 17.)

మన ప్రకృతిగుణములకు తగినమట్టు కుపాసనకు మూరిని వెదకుకొందుము. మనము దేని నుపాసింతుమో దాని

గుణము మనకు వచ్చును. ఇట్లుపాసనచేయువానిగుణమును ఉపాసన క్రమమును నొకటి నొకటి సంబంధింపబడియున్నవి.

ఏవిధమైన శ్రద్ధనుగాని నమ్మికనుగానికలిగి కర్మములు చేయుదుమో నదియును ఇట్టిదియే. పొందిన గుణమునకు తగిన శ్రద్ధమనస్సునకు చేరును. చేరొన్న శ్రద్ధకు తగినగుణ మువచ్చి చేరును.

ఆచారములును, ప్రవృత్తివిషయములును ఇట్లే ఇవ న్నియు మనము వడసిన గుణమునకు దగినవరకు నేర్పడును. గుణమును వానిననుసరించి మారును. పొయ్యిలోని నిప్పున కును కట్టెలకును గల సంబంధమువంటిది. మొదట నిప్పుక ట్టెను మండించును. కట్టె మండినయెడల నిప్పు మరింత మం డును. పరస్పరము సహాయ మేర్పడును. మంచి గుణములు పొందినవాడు, మంచి గురువును మంచి దైవమును, మంచి మనోభావములను, మంచి లక్ష్యములను ఏర్పరచికొనును. దానిచే గుణ మింకను మేల్మిని పొందును. మంచిగుణములం దతనికి రుచికలుగును. మంచియాహార మతనికి సంతోషమి చ్చును. వానిచే వాని మంచిగుణమింకను వృద్ధియగును. గుణములేనివాని బుద్ధియో, యుపయోగములేని యుపాసన, యుపయోగములేని తామస ప్రకృతి దురాచారము మొద లగువానిలో ప్రవర్తించును. రానురాను తామసగుణ మధిక మగును.

ఈ సుడిగుండమునుండి తప్పించుకొను మార్గమేదనిన కర్మమునుగూర్చి పూర్వము చెప్పినదానిని జ్ఞాపకమునకు తెచ్చికొనుటయే. ఆత్మకు స్వతంత్రబుద్ధి యున్నది. కర్మము చేయుట కధికారమున్నది. దానినుపయోగించి కర్మబంధము నుండి తప్పుకొను మార్గమును, స్వభావగుణముల నడచుటకు తగిన యుపాసన, ఆచారము, ఆహారము వీనిని నిత్యనియమముగ నుంచుకొనవలెను. ఇట్లుచేసినయెడల మేలును పొందుదుము. పూర్వకర్మఫలమునకును నీజన్మమున చేయుకర్మమునకును బీజాంకురసంబంధ మున్నది. చెట్టునుండి బీజము కలుగును. బీజమునుండి చెట్టు మొలచును. కారణము కార్యమగును, కార్యము కారణ మగును. ఇదే ప్రతి దినాచారమునకును, గుణమునకును పరస్పరసంబంధము. ఒకదానికి మరియొకటి కారణ మగును.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీచైవ తామసీ చేతి తాం శృణు.

ఒడలు దాల్చిన యాత్మకు స్వభావగుణమైన శ్రద్ధ మూడువిధములుగ కనబడును. సాత్త్వికము, రాజసము, తామసము అని. **17-2.**

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవసః

ఎవరికిని తమతమ జన్మగుణము ననుసరించి శ్రద్ధ కలుగును. జీవుడు తాను చేకొనిన శ్రద్ధ కనురూపుడై యుండును. ఏవ దేవస్తువునందు శ్రద్ధగల్గునో వా డావస్తువవలె నగును.

డంబమునకు చేయబడు తపస్సును, ఆచారమును, ఫలము నీయవు. లాభముగోరి చేయబడునదియు నట్లే. 17-3.

అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః
దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః.

కొందరు డంబమును అహంకారమును గలిగి, కామముచేతను చిత్తవికారముచేతను ప్రేరితులరై శాస్త్రములో నియమింపబడని ఘోరమైన తపస్సు చేయుచుందురు. 17-5.

కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాం చైవా న్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్

ఇట్లు బుద్ధిచెడినవారు తమ శరీరములోని భూతసమూహమును, నన్నును, హింసపెట్టుదురు. వీరసురబుద్ధి గలవారని తెలియుము. 17-6

తపస్సనునది మనోవాక్కాయములను మూడింటితో చేయబడినది. ఆర్జవము, శుచి, పెద్దలయెడ నడకువ, బ్రహ్మచర్యవ్రతము, భూతదయ, ఇవి దేహముతోచేయు తపస్సు; వాక్తపస్సనునది, సత్యము, ప్రీతి, హితమైనమాట, మంచి ధర్మగ్రంథములను చదువుట, మొదలగునవి. మనస్సును

శాంతముగ నుంచుట, శుద్ధమైన తలపులను తలచుట, భోగ ములనుగూర్చిన తలపులను విడచుట ఇవి మనస్తపస్సగును. ఇట్టి పలువిధములైన తపస్సులను లాభమును కోరక యితరుల గౌరవమును సంపాదించు నుద్దేశములేక తపోమహత్త్వమును గోరియే చేయవలెను. ఇతరులకు హింసనుచేయుటకు గాని, పిడివాదముచేయు బుద్ధితోగాని తపస్సుచేయుట కేవలము తప్పు.

దేవద్విజ గురుప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవం
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తపఉచ్యతే.

దేవుడు, ద్విజులు, గురువులు, ప్రాజ్ఞులు వీరిని పూజించుట, శౌచము, తిన్ననినడక, బ్రహ్మచర్యము, అహింస, ఇవి శరీరమునకు సంబంధించిన తపస్సు. 17-14.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చయత్
స్వాధ్యా యాభ్యాసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.

ఇతరుల మనస్సును కలతపరుప నట్టియు, సత్యము ప్రియమునైనట్టియు, హితకరమైనట్టియు మాటను మాట్లాడుటయు, శాస్త్రమును చదువుటయు, ఇవి వాక్కుతో చేయబడు తపస్సు. 17-15.

మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే.

మనశ్శాంతి, సౌమ్యస్వభావము, మౌనము, ఆత్మవినిగ్రహము, భావశుద్ధి, ఇవిమనస్సుతోచేయబడుతపస్సు. 17-16.

దానమును ఇట్లే. ఏ యుద్దేశముతో చేయుదుమో దాని ననుసరించి, విభజింపవచ్చును. ఇవ్వవలె ననుకర్తవ్యము గమనించి, వినయముతో మనస్సున ప్రతిఫలమున కెదురుచూడక యిచ్చునదే శ్రేష్ఠమైనదానము. పుణ్యాశతో యిచ్చుట కూడ రెండవ పక్షమే.

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతం.

ఇచ్చుట కర్తవ్యమని తెలిసి, ప్రతిఫలమును గోరక, తగినస్థలమును, పాత్రమును, కాలమును, చూచి చేసిన దానము సాత్త్వికదాన మగును. 17-20.

యత్తు ప్రత్యు పకారార్థం ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం తద్రాజస ముదాహృతం.

ప్రతిఫలమును కోరియో, ఫలము నుద్దేశించియో, మనస్సున కష్టముతోనో ఇవ్వబడిన దానము రాజసదాన మగును. 17-21.

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతం.

తగనిస్థలమున తగనికాలమున, తగనివారికి చేయబడు

నదియు, గౌరవింపక యవమానించి చేసినదానము తామస దాన మగును. 17-22.

మనము అనుదినమును తినుతిండి మన గుణములను గొప్పవిగను, నీచములుగను మార్చును. సాత్త్వికాహార మేది, శాంతచిత్తత కడ్డమువచ్చు రాజసాహార మేది? బుద్ధినడచు తామసాహార మేది? అనునది గీతలో సూచింప బడినది.

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు.

హోమమును, తపస్సును, దానమును, మూడును, మూడువిధములుగ నుండును. వారికివారికి ప్రియమైన భోజనముమూడువిధములుగనుండును. వానిభేదమునువినుము. 17-7.

ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రస్యా స్స్నిగ్ధా స్థిరాహృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః.

ఆయుస్సు, శక్తి, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి వీనిని వృద్ధిచేయునదియు, రసముతో గూడినవి, జిడ్డు గలవి, స్థిరముగ నుండునవి, శాంతి నిచ్చునవి యైన ఆహారములు సత్త్వగుణముగలవారికి ప్రియము. 17-8.

కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః
ఆహారా రాజస స్యేష్టా దుఃఖ శోకామయప్రదాః.

కారము, పులుపు, ఉప్పు, మిక్కిలివేడి, ఎక్కువ

చురుకుగలవియు, విదాహమును గలిగించునవియు నగునాహారములను రజోగుణము కలవారు కోరుదురు. ఇవి దుఃఖము, శోకము, రోగము, వీనికి కారణమగును. 17-9.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియం.

పాచిదిది, రసహీనమైనది, కంపుకొట్టినది, రాత్రియంతయు నిలువనుంచినది, ఎంగిలి, అశుద్ధమైనది. ఇట్టి యాహారములందే తమోగుణముకలవారు ప్రీతినిచూపుదురు. 17-10.

ఇవి వేలకొద్ది సంవత్సరములక్రింద వ్రాయబడిన శ్లోకములని జ్ఞాపకముంచుకొని, వీనిసారాంశమును గ్రహించి,దినదినజీవితమును గడపుకొనవలెను.

24

## ప్రపత్తి.

(గీత: అధ్యాయములు 9, 10, 12, 14, 18)

అవ్యక్తబ్రహ్మమును ధ్యానించుట కష్టము. సర్వకళ్యాణగుణములును గల సర్వేశ్వరు నుపాసించుటే సులభమైనమార్గము. కర్మయోగమార్గమున చెప్పినట్లు స్వలాభము

నువిడిచి, సంగము లేక సమచిత్తముతో కర్మములను, చేయు టకు తోడుగ, కరుణామూర్తియగు నారాయణునికే మనము చేయుకర్మములనెల్ల నర్పణముచేయుచునడుచుకొనవలెను. తుద కతనియనుగ్రహమే మనలను కాపాడును. మరియొకటి కాదు. అతనియనుగ్రహమున్న యింద్రియముల నడచి, నడుచుకొన వచ్చును. సమత్వమును, శాంతమును, మనస్సును నమర్చు కొనవీలగును. ఆశ, జయము, మైకము వీనినుండి మనలను కాపాడుటకు, భగవానునియనుగ్రహము లేకున్న వీలులేదు. అట్లయిన యేకర్మమును చేయజొచ్చినను ఈశ్వరు నుద్దేశించి యతని కర్పణముగ దానిని చేయవలెను.

ఇదియే భక్తిమార్గ మనునది. ఇది కర్మయోగ మని చెప్పబడుమార్గమునకు బదులుగచేకొనగూడిన యొక ప్రత్యేక మార్గము కాదు. కర్మయోగమున చెప్పబడిన మనోభావము లేనివాడు భక్తియోగముచేయచాలడు. ఈశ్వరస్మరణమును, భక్తియు లేనివాడు కర్మయోగమార్గము ననుసరించుటయు నరుడు. భక్తియోగమును, కర్మయోగమును ఒకదాని కొకటి సహాయకారులు. చదువునప్పుడు వ్యత్యాసము కనబడినను, సరిగ నభ్యసించినయెడల రెండునునొక్కటేయని తెలియును.

శ్రీమన్నారాయణుని శరణుజొచ్చుటయే యెల్లమార్గ ములకునుగమ్యస్థానము. తక్కినమార్గములనుగూర్చి వివరించు

కొనుచున్న యెడల ఫలము లేదనుట గీతలోనితుదియుపదేశము.
ఎట్టిపాపియైయున్నను, భగవంతునిమనఃపూర్వకముగ శరణు
జొచ్చినవాడు నాశము నొందడు. ఎంతటి జ్ఞానియై యున్నను
అతనిని శరణుజొరకున్న తరించుటకు వీలులేదు.

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే.

అవ్యక్తమున మనస్సు నిలిపినవారికి కష్ట మెక్కువ.
దేహధారులకు అవ్యక్తోపాసన మిక్కిలి కష్టము. 12-5.

యేతు సర్వాణి కర్మాణి మయిసన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాంధ్యాయ న్త ఉపాసతే
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్
భవామి నచిరాత్పార్థ మయ్యావేశిత చేతసాం.

ఎల్లపనులను నాకు సమర్పించి మనస్సును నాయందే
నిలిపి అనన్యమైన యోగముతో నన్ను ధ్యానించి నడచు
వారును నాయందు చిత్తమునుంచువారునైన జనులను, మర
ణము, సంసారము అను సముద్రమునుండి వేగముగ విడిపిం
తును. 12-6, 7.

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

చలింపని భక్తియోగముతో నన్నుపాసించువాడు,

గుణములను గడచి బ్రహ్మపదమును పొంద తగినవాడగును. 14-26.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరం
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ.

చిత్తమును నాయందు నిలిపి, ప్రాణమును నాయందే చొప్పించి నన్నుగూర్చి యొకరితో నొకరు చెప్పి తెలిసికొనుచు నాభక్తులు తృప్తిని శాంతిని పొందుదురు. 10-9.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే.

ఎప్పుడును మనస్సు వశముచేసుకొని ప్రీతితో నన్ను చేరువారికి నేను బుద్ధియోగము నిత్తును. దానివలన వారు నన్ను పొందుదురు. 10-10.

తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా.

వారినికరుణించుటకు వారిమనోభావములందు చొచ్చి ప్రకాశించుజ్ఞానజ్యోతితో వారియజ్ఞాన మను చీకటిని తొలగింతును. 10-11.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం.

వేరుతలపును తలపక నన్నుపాసించు నిత్యయోగుల యోగక్షేమమును నేనే భరింతును. 9-22.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదా త్పరాంశాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం

ఈశ్వరునే తుదివరకు శరణుచొరుము. అతనిఅనుగ్రహ మున అంతటను సంపూర్ణశాంతియును శాశ్వతస్థానమును పొందుము. 18-62.

సర్వ గుహ్యా తమం భూయ శ్శృణు మే పరమం వచః
ఇష్టోఽసిమే దృఢమితి తతో వక్ష్యామి తేహితం.

అన్నిటికంటె ముఖ్యమైనదియు, నన్నిటికంటె రహస్య మైనదియు నైన నాపరమవచనమును వినుము. నాకు నీవు ప్రేమపాత్రుడవు కావున నీకు హితమును వృద్ధియు నగునట్లు చెప్పుచున్నాను. 18-64.

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసిమే.

నీమనస్సును నాయందు విడువుము. నామీద భక్తి నిలుపుము. నాకనియే హోమములనెల్ల చేయుము. నాకే నమస్కరింపుము. నన్ను చేరుదువు. ఇది సత్యము. నీకు వృద్ధి గూర్చెదను. నీవు నాకు ప్రియమైనవాడవు. 18-65.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

తక్కిన యెల్లధర్మములను విడిచిపెట్టి నన్నే శరణు పొందుము. ఎల్లపాపముల నుండియు నేను నిన్ను విడిపించె దను. దుఃఖింపకుము. 18-66.

## 25.

## అంతయు నొకటి.

(గీత అధ్యాయములు 5, 6, 8, 13, 18)

మనస్సును అరకట్టి చేయు కర్మములను భగవంతుని కర్పణముగా చేయుచు వచ్చిన యెడల, జీవలోకమంతయు నొక్కటేయను జ్ఞానప్రకాశమును పొందకలుగును. తాననిఒరులని భేదము విడిచి యెల్ల ప్రాణులును పరమాత్మయందు నిలుచు మనోభావమును పొందుటే గీతలో చేయబడిన ఉపదేశము. ఆత్మను అజ్ఞానమనునది చుట్టుకొని జ్ఞానజ్యోతిని మరుగుపరచును. ఈ అజ్ఞానమును పోగొట్టి ఆత్మలో జ్ఞాన ప్రకాశమును ఉదయించునట్లు చేసుకొన్నయెడల ఆమార్గ మున్ను పట్టినవాని కంటెకి, విద్యయు, కళలును, శీలమును గలిగిన పండితుడును, దేనిని నేరని యొక పామరుడును

ఒక్కటిగనే తోచును. అనగా ఈఇద్దరిలోను ఆతడు వాసుదేవుని చూచును. మనుష్యులలో శ్రేష్టుడు, నీచుడు అనువ్యత్యాసము తొలగిపోవును. ప్రాణులఅంగవ్యత్యాసములుకూడ జ్ఞానమునొందినవాని కంటికి వ్యత్యాసముగతోపవు. ఎద్దు, ఏనుగ, కుక్క, కుక్కనుతినువాడు, విద్యావినయములు గల బ్రాహ్మణుడు, వీరిలో అవయవములకూర్పు మొదలగు సకలవ్యత్యాసములు అతని దృష్టిలో తొలగి అంతయు నొక్కటిగా తోచును.

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవ ద్జ్ఞానం ప్రకాశయతి తత్పరం.

అజ్ఞానము ఆత్మజ్ఞానముచే నడచినవారి జ్ఞానము సూర్యునివలె ప్రకాశించి పరమాత్మను చూపించును. 5-16.

విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః.

విద్యయు వినయమును గల బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్కను, కుక్కను తినువానిని, జ్ఞానమునొందిన వారు సమదృష్టితో చూతురు. 5-18.

యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా.

పలువిధములైన ప్రాణులు ఒక్కటే యాధారముపై నెలకొనియున్నవనుటను తెలిసినయెడల అప్పుడా జ్ఞానఫలముగ ఎల్లయెడల విస్తరించిన బ్రహ్మమును చూచును. 13-31.

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికం.

వేరుగనున్న యెల్లప్రాణులను వేరులేనట్టియు, ఒక్కటే వస్తువుగ చూచు జ్ఞానము సాత్త్విక జ్ఞానమనియు తెలియుము. 18-20.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాఽత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనః.

యోగమార్గమున నిలిచిన వాడెల్లెడల సమదృష్టి కలవాడై యెల్లప్రాణులందును తనప్రాణము చేరియుండుటను, తనలో నెల్లప్రాణులునుండుటయు చూచును. 6-29

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం నప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి.

ఎవడు ఎల్లయెడల నన్ను చూచునో, ఎవడన్నిటిని నాయందే చూచునో, వానికినేను ఎప్పుడును లేకుండ నుండను. చాకును వాడొకప్పుడును లేకుండనుండడు. 6-30.

సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః
సర్వథా వర్తమానో ఽపి స యోగీ మయి వర్తతే.

ఏకత్వమందు నెలకొనియున్నవాడై, యెల్లప్రాణుల యందునున్న, నన్ను తెలిసినవాడు ఏపని చేయబోయినను యోగియగును. నామార్గమున నడచినవాడగును. 6-31.

గీతలో మనోనిగ్రహమును గూర్చియు, జ్ఞానోదయమును గూర్చియు, చెప్పబడిన యుపదేశములు, వ్యర్థముగనో, పుస్తకమునకు, భూషణముగనో లేక చదివి మననముచేసి కాలము గడుపుటకో చెప్పబడినవికావు. నిజముగ సాధారణ జనులు, పురుషులును, స్త్రీలును, దానిలో చెప్పినట్లు జీవితమును నడపవలెనను నుద్దేశముతో నుపదేశింపబడినవి. వేదాంతపాండిత్యమును చూపి, సంతోషపడుటకు వ్రాసినవి కావు. వయసు ముదిరిన వారికిని చిన్నవయసువారికిని లౌకిక విషయములలో తగులుకొన్నవారికిని, ఏదశయందున్నవారికైనను, ఫలకారులుగ చేయబడిన యుపదేశములు ఎల్ల కాలములకును చెప్పబడినవి. ఒకప్రత్యేక సందర్భమునకు మాత్రము చెప్పిన యుపదేశములు కావు.

తక్కిన మతగ్రంథములవలె గీతయు శాశ్వతధర్మము నుపదేశించు ఒక గ్రంథమైనను దానిని వ్రాసినకాలమున ఎట్టి జీవితపరిస్థితుల నందరనుసరించి వచ్చిరో, యాకాలమున సంఘ సంప్రదాయక్రమమేమైయుండెనో, స్మరణయందుంచు కొన్నయెడల నుపదేశింపబడు సత్యతత్త్వమును గ్రహింప వచ్చును.

తరువాతకాలముననుండిన కొన్ని సాంప్రదాయములు ఆకాలమున లేవనుదానిని మరచిపోగూడదు. జాతివ్యత్యాసములు విడిచి యందరును నొకజాతిగా నుండవలెనను ఉద్యమమునకును, అస్పృశ్యతను రూపుమాపి హరిజనులను తక్కినవారితో సమానముగా చేయవలయునను ఉద్యమమునకును ఆధారముగా శ్లోకములను వ్రాసిచూపుటకై భగవద్గీత వ్రాయబడలేదు. అట్లాధారముగా వ్రాసిచెప్పిన గీతలో శ్లోకములు లేనేలేవనునది చాలవేలసంవత్సరములకుపూర్వము వ్రాయబడిన యొకగ్రంథమునుగూర్చి నిశ్చయమైన ఆక్షేపణ కాజాలదు.

అయినను ఇట్టిసమత్వములనుగూర్చిన యుద్దేశములకు కూడ కావలసినన్ని ప్రమాణములు గీతలో నున్నవనుదానిని గమనింపవలెను. ఎల్లజనసంఘములందును, పనులను చేయు విధము ముఖ్యమైన యంశము. ఇది జాతిక్రమముగ అనగా నాయాజాతి నాయాక్రమముండవచ్చును. ఆయా కుటుంబము లాయాపనుల కనియు నుండవచ్చును. లేదా పుట్టుకను లెక్కింపక వేరువిధముగా నుండవచ్చును. ఏమార్గము ననుసరించినను గీతావాక్యముల తత్త్వము తుదివరకు నన్వయించును. ఈపని శ్రేష్టమైనది, ఇదిమంచిది, దీనిని చేయుమను, నొక నిర్ణయమితముగ నొక పనివలదు అని యెవ్వరును చెప్పగూడదు. ఇది గీతోద్దేశము. సంఘజీవనమున కావశ్యకమైన పనులలో

ఇట్టిభేదము నెంచుటకు వీలులేదు. ఇది సర్వకాలములకును, సర్వసంఘపద్ధతికిని అన్వయించును. ప్రాచీనకాలమందలి వర్ణ సంస్థ రష్యాలో నడచుచు వచ్చుచున్న సామ్యవాదపద్ధతికిని సమానముగ నన్వయించును. నిప్పులో పొగయున్నట్లు లోక ములో చేయగూడిన యెల్లపనులందును దోషము కనబడును. ఏపనినైనను పవిత్రము చేయగల యొక భావనగలదు. తనకు లాభమునో, సుఖమునో వెదుకక, సంఘజీవనమునకు మేలు చేయుదునను మనోభావమది. అదియే సకలకల్మషమును పోగొ ట్టగల గంగాతీర్థము. ఇదియే గీతావాక్యపు ముఖ్యాంశము. ఆకాలమున జాతి క్రమముగ పని విభజింపబడియుండుటవలన మంచి ముఖ్యతత్త్వమును స్పష్టముచేసి, యుపదేశము వ్రాయ బడియున్నది. అయినను నీతత్త్వము పని నేవిధముగ విభా గముచేసినను నన్వయించును. ఉన్నగోడమీద చిత్రము వ్రాయబడును. పటమును గమనింపవలెనేగాని గోడకూర్పు కాదు గమనింపవలసినవిషయము. ఆకాలమున నాచారము లోనున్న పద్ధతులను రూఢిగనున్న సంఘరచనాక్రమమును మనస్సున నుంచుకొని, యేయుత్తమ సమత్వతత్త్వము బోధింపబడినదో, యాతత్త్వమును బాగుగ తెలియవలయును.

స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతితచ్ఛృణు.

తనతనపనియందాసక్తిగల మనుష్యుడు సిద్ధినొందును. తనతనకార్యమునందాసక్తిగలవాడు సిద్ధిపొందుమార్గమెట్లుండునో వినుము. 18-45

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వ మిదంతతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః.

ప్రాణులకెల్ల బుట్టుక దేనినుండికలుగునో యేపరమాత్మునినుండి సమస్తములు వ్యాపించియున్నవో, యట్టి పరమాత్మను పూజించుటవలన మనుష్యుడు సిద్ధిపొందును. 18-46

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మకుర్వ న్నాఽఽప్నోతి కిల్బిషం.

ఇతరులధర్మమును బాగుగ చేయుటకంటెను, గుణము తక్కువయైనదైనను తన ధర్మమును నిర్వర్తించుట శ్రేయస్కరము. తన స్వభావమువలన నేర్పడినపనిని చేసినయెడల నాపనిలో నుండు సహజమైన దోషము నెవ్వడును పొందడు. 18-47.

సహజం కర్మ కౌంతేయ సదోష మపి న త్యజేత్
సర్వారంభా హి దోషేణధూమేనాగ్ని రివాఽఽవృతాః

తనతోబుట్టిన కర్మము దోషముతోగూడియున్నను దానిని విడువగూడదు, అగ్నిని పొగ యావరించినట్లు సమస్త కార్యములు దోషసంపర్కము కలిగియుండును. 18-48.

అసక్త బుద్ధి స్సర్వత్రి జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి.

సర్వవిషయములయందునుమమకారము లేక తన్ను తా గెలచి, కామమును విడిచి నిలిచినయెడల నాత్మాగ దృష్టివలన కర్మలేని పరమసిద్ధిని పొందును. 18-49.

లోకములోకనబడు దృశ్యముల వివిధవ్యత్యాసములకు వెనుక మరుగుపడి యడగియున్న పరతత్త్వమును చింతింపవలెను. పుట్టుక, చావు, వ్యక్తమును, అవ్యక్తము నెరుగదు. పిల్లలకు పగలును రాత్రియు నెట్లో లోకము వ్యక్తమగుటయు, నాశమును అట్లే. బ్రహ్మ కన్ను మూయుటయు తెరుచుటయునే నాశము సృష్టియు అగును. జ్ఞానోదయము నొందిన మనుష్యుని యింద్రియములకు గోచరమగు నెల్లవిషయములును మనస్సును భావములునుచేయు నెల్లపనులును, పరవస్తువు రూపములేయగును. అనేకకోట్ల దృశ్యములును ఒక్కటిగ నేకనబడును. యోగమున కంతమిదే.

అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్య క్తసంజ్ఞకే.

పగలయినంతనే యవ్యక్తమునుండి రూపములు బయలుదేరును. రాత్రిరాగానే యాయవ్యక్తమునందే యవి మరుగుపడును. 8-18.

భూతగ్రామ స్సఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే.

ఆభౌతికప్రపంచము తిరిగి తిరిగి తనవశము లేకయే రాత్రి యగుటతోడనే యడగిపోవుచున్నది, పగలురాగానే మరల పుట్టుచున్నది. 8-19.

పర స్తస్మా త్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తా త్సనాతనః.
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి.

అవ్యక్తముకంటె నవ్యక్తముగ, దానికిపైనున్న మార్పులేని తత్త్వమొకటి యున్నది. ఎల్లప్రాణులును నశించినను, అది నశింపదు. 8-20.

పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా
యస్యాంతస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్

వేరుతత్త్వమున ప్రవర్తింపని భక్తితో నా పరమపురుషుని పొందవచ్చును. వానిలోనే యెల్లభూతములును నెలకొనియున్నవి. అతడీ లోకమందంతటను వ్యాపించి నిలిచియున్నాడు. 8-22

కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః
సర్వస్య ధాతార మచి న్త్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్.

గొప్పజ్ఞానిని, పురాతనుని, అనుశాసకుని, అణువులో నణువైన పరవస్తువును, ఎల్లవానిని ధరించువానిని, ఎన్నుటకు వీలులేని రూపముగలవానిని, సూర్యుని ప్రకాశముగలిగి, చీకటి నతిక్రమించి నిలుచువానిని, ఎవడు ధ్యానించుచుండునో, 8-9

ప్రయాణకాలే మనసాచలేన
భక్త్యాయుక్తో యోగబలేన చైవ
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యం.

అతడు మరణకాలమున జంచలముకాని మనస్సుతో కనుబొమలమధ్యమున ప్రాణమును నిలుపుకొని, యోగబలముచేతను, భక్తిచేతను, ఆదివ్యపరమపురుషునిపొందును. 8-10

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్

ఎల్లద్వారములను బాగుగమూసి, మనస్సును హృదయములోనే నిరోధించి, తనప్రాణమును తలపైభాగమున నిలిపి, యోగస్థానమును ధరించి, 8-12

ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిం.

'ఓమ్' అను శ్రేష్ఠమైన యేకాక్షరవేదమును జపించు కొని, నన్ను స్మరించువాడయి, దేహమును విడుచువాడు పరమగతిని పొందును. (8-13)

అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః
త స్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః

వేరుతలపునువిడిచి, నన్నెల్లదినములందు, నెప్పుడును స్మరించు నిత్యయోగికి నేను సులభముగ దొరకుదును. 8-14

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్.

దీనిని తెలిసినయోగి యజ్ఞములచేతను, తపస్సులచేతను, దానములచేతను, పొందదగినదిగా వేదములందు చెప్పబడు నాదిస్థానమయిన పరమపదమును పొందును. 8-28

చనిపోవునపుడుకూడ మనస్సును స్థిరపరుచుకొని, భగవంతుని ధ్యానించి, ప్రాణమును విడిచినయెడల పరగతిని పొందవచ్చునని పైని 9, 10, 12, 13 శ్లోకములలో చెప్పబడినది. సనాతనమైన తత్త్వము, దీనితత్త్వ మెట్టిదనిన:-

(1) ఎట్టిజీవితము గడపువానికైనను గతియున్నది. ఒకధర్మము నాచరింపకయే, ఒక పుణ్యతీర్థమునందు మునుగ

కయే, 'పలుగొప్పపాపములను చేసితినే' అవకాశము లేకుండ గనే మరణమువచ్చినదే', అని ఇట్లు దుఃఖపడనక్కరలేదు. ప్రాణమునువిడుచు సమయమందైనను భగవంతునియందు మనఃపూర్వకముగ భక్తిచూపినయెడల అదియేసద్గతినిచ్చును. ధైర్యముతోను భక్తితోను మరణము నెదురుకొనవలెను.

(2) మరణకాలమునగూడ పలుసంగములను మనస్సున నుంచుకొని ప్రాణమును విడువ నిష్టములేక దుఃఖపడుట, ప్రాణమును విడుచుటకు మార్గముకాదు. భగవంతుని ధ్యానముచేసికొని ప్రాణమును విడుచుటే మంచిదనునది రెండవది.

(3) మరణమెప్పుడువచ్చునో చెప్పవీలులేదు. ఏతరుణమందైనను మరణము రావచ్చును. కాబట్టి మరణకాలమున ఈవిధముగ మనస్సును నిరోధించి, భగవంతుని ధ్యానింపవలయుననియు, ఎల్లకాలమును ఇట్లుండవలయుననియు అనునది మూడవది.

## 26.

## అద్వైతము, కర్మయోగము.

ఈసందర్భమున నొకప్రశ్న పుట్టును. అద్వైతమును గూర్చి గురుముఖముగా నుపదేశమునొందక యాసిద్ధాం

తమున కొన్ని భాగములనుమాత్రము విని తృప్తినొందువారి కొక సందేహము తోచవచ్చును. జీవాత్మయు, పరమాత్మయు వేరుకావు. రెండును ఒకటేఅను మతము సత్యమైనదయిన యెడల నింద్రియముల నడచుట మొదలయిన యాశ్రమతో గూడిన పద్ధతులెందుకు? తానే బ్రహ్మమని తెలిసినతోడనే చింతలేకయుండవచ్చునుగదా !

ఇది సత్యమేకాని, ఇది దృష్టిని పొరబెట్టునట్టి అసత్య భావము. దీనిని విడువవలెను. అద్వైతవేదాంతమున చెప్ప బడిన అవిద్య యట్టిసామాన్యమైన 'టాకీ' దృశ్యము కాదు. కన్ను, చెవి, ముక్కు, ఎల్లయింద్రియములు, అంతరంగమగు మనస్సు, బుద్ధి,- అన్నిటినావరించియున్న ఈ యవిద్యఅను నది, దేహమును, బుద్ధిని, ఆత్మను, ఆవరించి యన్నిటియం దును కలిసినిలిచియున్నది.

ఇది యొకపక్షమునకుచెందిన భావనయని చెప్పిన మాత్రమున ముగిసిపోదు; శరీరము, మనస్సులోనున్న, యొక్కొక్క సూక్ష్మాణువును తాకి, మేల్కొల్పి మలినమును తొలగింపవలసినదిగానున్నది. దానికి నిష్ఠ, ఇంద్రియనిగ్ర హము, నిస్సంగత్వము అన్నియు కావలెను. మాయనుండి దృష్టిని విడిపింపవలెనని సత్యమును తెలిసినంతమాత్రము, సరిపోదు. మాయనుండి తప్పుకొనవలెనని తెలియుట ఒకటి. తెలిసినపిదప తప్పుకొనుట మరియొకటి. నేను తెల్లవారు

జామున నాలుగుగంటలకు లేవవలెనని యనుకొనుట యొకటి అట్లు లేచియుండుట మరియొకటి. అవిద్యను సత్యముచే దూర ముచేయుటయే మోక్షము. దానికి మార్గము యోగము. అద్వైతమార్గమున జీవుని అవిద్యనుండి విడిపించుటకును, ద్వైత మార్గమున జీవుని కర్మబంధమునుండి తప్పించుటకును, రెంటి కిని మార్గమొకటే. అద్వైతమార్గము విని 'అవు' నని చెప్పిన తోడనే అవిద్య తొలగిపోదు. సత్యముగ నది తొలగవలసిన యెడల కర్మబంధమునుండి తొలగుటకు ద్వైతవాదు లేమేమి చేయవలెనని చెప్పియున్నారో, వాటినన్నిటిని అద్వైతవాది యు చేయవలసియున్నది. ఇట్లు చేసినయెడల మోహమును నది తొలగును. అనగా కర్మబంధమును దానిని తొలగించు కొనుమార్గములు ద్వైతపద్ధతినిగాని, అద్వైతపద్ధతినిగాని, వ్యత్యాసములు కలిగియుండవు. ఇదియే ఆచార్యులవారి ఉపదేశము.

ఎల్లప్రాణుల విషయమందును జీవకారుణ్య భావము కూడ మనస్సున లేకుండినయెడల, జీవుడును, పరమాత్మయు నొకటియను యద్వైతజ్ఞానము చాలదూరమగును. ఆచార్యు లువారు వ్రాసిన గ్రంథములనుండి జీవుడును బ్రహ్మమును సత్యముగ నొకటేయని మతసంప్రదాయమునుబట్టి తెలిసికొ నుట వేరు, సత్యమైన జ్ఞానప్రకాశము వేరు. జ్ఞానప్రకాశము నొందుటకు తెలివికావలెను. కాని తెలివిమాత్రమే సరిపోదు.

నావిరతో దుశ్చరితా న్నాశాన్తోనానాసమహితః
నాశాన్తమనసో వాఽపి ప్రజ్ఞానే నైన మాప్నుయాత్.

చెడునడతను విడువనివాడును, మనస్సున శాంతము పొందనివాడును, ఇంద్రియములను నణపనివాడును, ఆశతో గూడిన కోరికలను విడువనివాడును, జ్ఞానమునొందినను ఆత్మను కానచాలడు.

నియమము, ఇంద్రియముల నణచి యేలుట, ఇంద్రియములను విషయములందు చరింపకుండ నిరోధించుట, పనులను స్వలాభాపేక్షయు, సంగమునువిడిచి, భగవంతుని కర్పణముగ చేసి ముగించుట, నభ్యసించుట, సుఖదుఃఖములను, నింపుకంపులను, ఒకటేమాదిరిగ నెంచుకొనుట; ఈ అభ్యాసములెల్ల అవిద్యను తొలగించుకొని యద్వైతమనో భావములను పొందుటకు సాధనములు; మోహమునకును, భేదబుద్ధికిని, చికిత్సాక్రమములు. వీనిని గైకొనక విషయముల ననుభవించుటయం దాశగలిగి ఉన్నచో, బ్రహ్మమును, జీవుడును ఒకటను సత్యజ్ఞాన మొకనాడును ఉండజాలదు. పథ్యము లేకుండుటచేత వ్యాధి యధికమగునట్లు, రానురాను మైకమును, భేదబుద్ధియు అధికమగును. గ్రంథములనుండి తెలిసికొనినమందు పథ్యము లేక గుణము నివ్వజాలదు. చిత్తరువునకును, జీవమనుష్యునికిని నుండు వ్యత్యాసమును పోలియుండును. అప్పుడే యుపయోగము లేని జ్ఞానమునకును,

సత్యమైన జ్ఞానప్రకాశమునకును ఉన్న భేదము సత్యమైన యద్వైతజ్ఞాన ముదయించినయెడల జీవితము తనంతటనే శుద్ధమైపోవును. విషయలంపటములు తొలగిపోవును. విషయ సంగములు తొలగగా తొలగగా జ్ఞానము మరింత యెక్కు వగా ప్రకాశించుచుండును.

దీనిచేతనే భగవద్గీత యనునది, ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతమతములలో చేరినవారికందరకును శాస్త్రముగ నుండి వచ్చుచున్నది. బ్రహ్మమును, జీవుడు నొక్కడా, వేరా యను ప్రశ్న భగవద్గీతలో నుపదేశింపబడిన యనాసక్త యోగమును, జ్ఞానయోగమును, ప్రపత్తిమార్గములను నేవిధ మునను బాధింపవు.

## 27

## విశ్వరూపదర్శనము

భగవద్గీత పదకొండవ అధ్యాయములో భగవంతు డర్జునునకు, విశ్వరూపము చూపించుట చెప్పబడినది. మేలు, కీడు, సుఖము, దుఃఖము, చీకటి, తేజస్సు, అను ద్వైతము లను గడచి నిలుచు భగవంతుడు తన సర్వవ్యాపకమై విశ్వ రూపము నర్జునుడు చూచునట్లతనికి జ్ఞానదృష్టిని అనుగ్ర హించి దర్శనము నిచ్చెనని చెప్పబడినది.

దీని తత్త్వమేమి? అంతఃశ్శుద్ధియు, బాహ్యశుద్ధియు గల శుద్ధజీవనమును నొకడు నడిపి, సకలకర్మములను సంగము లేక భగవంతుని కర్పణముగచేసి బుద్ధిని స్థిరముగ నిలుపుకొని యడుగడుగునకు ధ్యానముచేయుచు వచ్చినయెడల భక్తునికి భగవంతుని విశ్వరూపము కనబడును. అనగా జ్ఞానోదయమై భగవంతు ననుభవించుననునదే. ఆదర్శమును గూర్చి సంజయుడు చెప్పుచున్నాడు:—

ఏవముక్త్వా తతోరాజన్ మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరం

సంజయుడు చెప్పుచున్నాడు: "రాజా! ఇట్లుచెప్పిన పిదప, మహాయోగేశ్వరుడైన హరి, తన పరమైశ్వర్యరూపమును పార్థునకు చూపెను." 11-9

దివి సూర్యసహస్రస్య భవేద్యుగప దుత్థితా
యదిభా స్సదృశీసాస్యా ద్భాస స్తస్య మహాత్మనః.

ఆకాశమున ఒక్కటే క్షణమున వేయి సూర్యబింబములు కనబడినయెడల నాకాంతిని విశ్వరూపపుకాంతితో పోల్చవచ్చును. 11-12

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకథా
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా.

అప్పుడు పలువిధములుగ నున్న జగత్సృష్టియంతయు, నా దేవదేవుని శరీరమున నొకచో గూడి నిలిచియుండుటను పాండవుడు చూచెను. 11-13

అర్జునుని స్తుతి:—

అర్జున ఉవాచ:—

పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూతవిశేషసంఘాన్,
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్.

దేవా! నీ దేహమున ఎల్ల దేవతలను ప్రాణికోట్లను కమలాసనమున కూర్చున్న బ్రహ్మను, యీశుని, ఎల్ల ఋషులను, దివ్యసర్పములను, చూచుచున్నాను. 11-15.

అనేక బాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపం,
నాంతం నమధ్యం నపున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప.

అనేక బాహువులు, ఉదరములు, వక్త్రములు, అనేక నేత్రములునుగల మేరలేని నీరూపమును అన్ని దిక్కులందున్ను చూచుచున్నాను. అన్నిటికి నీశ్వరుడా! విశ్వమును నీరూప

ముగ గొన్నవాడా ! నీకంతమునియు, మధ్యమనియు, నాది యనియు, గానలేకున్నాను. 11-16.

కిరీటినం గదినం చక్రిణాం చ
తేజోరాసిం సర్వతో దీప్తిమంతం,
పశ్యామి త్వాం దుర్ని రీక్ష్యం సమంతా
ద్దీప్తా నలార్కద్యుతి మప్రమేయం.

కిరీటమును, గదను, చక్రమును, ధరించినవాడై, తేజోరాశివై, అన్నిప్రక్కలను, వెలుగును వ్యాపింపచేయుచున్నావు. ధగ ధగమండు మంటవలెను, సూర్యునివలెను, చూడ నసాధ్యమైన ప్రకాశముతోగూడిన నిన్ను చూచుచున్నాను. 11-17.

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వశ్య పరం నిధానం,
త్వమవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతోమే.

నాశము లేనివాడా! తెలియదగినవాడవు. లోకమున కాధారుడా! నశింపనివాడా! ఎప్పుడును ధర్మమును కాపాడువాడా ! మార్పులేనివాడా ! నిన్ను కనుగొంటిని. 11-18.

త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరంనిధానం,

వేత్తాసి వేద్యంచ పరంచ ధామ .
త్వయా తతం విశ్వ మనన్తరూప.

నీ వాదిదేవుడవు ! ఆదిపురుషుడవు, నీవే సర్వమునకు పరమ నిలయమవు, తెలియదగిన తత్త్వమవై, పరమపదవివై, అనంతరూపుడవై లోకమంతటను వ్యాపించియున్నావు. 11-38.

వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ,
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే.

వాయువవు నీవే, యముడవు నీవే, అగ్నివి నీవే, వరుణుడవును, చంద్రుడవును, బ్రహ్మయును నీవే; నీకు వేయి సారులు నమస్కరించుచున్నాను. మరియుమరియు నీకు నమస్కరించుచున్నాను. 11-39.

నమః పురస్తా దథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనంతవీర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః.

ముందుభాగమున నీకు నమస్కారము, వెనుకభాగమున నమస్కారము; అంతయు నయినవాడా! నీకెల్లప్రక్క-

అను నమస్కరించుచున్నాను. ఎన్నడును అంతము లేనివీర్య ముగలవాడా! అలవి లేనివిక్రమము గలవాడా! అన్నిటను పూర్ణుడవై యున్నవాడా! అంతయు నైనవాడవునీవే. 11-40

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్,
నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయే ప్యప్రతిమ ప్రభావ.

చరాచరలోకమునకు తండ్రివి, పూజ్యుడవు, గొప్ప గురుడవు, నీకు సముడెవడును లేడనగా, నిక నీకంటె నెక్కువ వాడెవడుండును? మూడులోకములందును నీప్రభావమునకు సాటిలేదు. 11-43.

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహ మీశ మీడ్యమ్,
పితేవ పుత్త్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయాఽర్హసి దేవ సోఢుమ్.

శరీరమును సాష్టాంగముగ వైచి నీ యనుగ్రహమును వేడుచున్నాను. ఈశా! పూజ్యుడా! కొడుకును తండ్రివలెను, స్నేహితుని స్నేహితునివలెను, ప్రియురాలిని ప్రియుడువలెను నన్ను సహింపవలెను, దేవా!. 11-44.

# తుదిపలుకు.

ఇంత మనము చదివిన విషయములను సంగ్రహముగా చెప్పవలెననిన పూర్వజన్మమున చేసిన కర్మములచేతను, సంగమములచేతను కొన్నిగుణములతో గూడి దేహప్రకృతులను పొంది పుట్టుదుము. ఈ స్వభావగుణములే జీవుని బంధించుచున్నవి. వానిని సంపూర్ణముగ నిగ్రహించి విడువవచ్చునని, పక్వము కానికాలమున సన్యసింప ప్రయత్నించినందువలన ప్రయోజనము లేదు. కాని ఈ స్వభావగుణములను గెలిచి, విడుదలనొంద ప్రయత్నించుటకు, స్వాతంత్ర్యమును, శక్తియు, జీవుని కున్నవి. ఈ జన్మమున జీవుడెట్లు నడుచుకొనుచున్నాడో యామార్గము ననుసరించియే యతని తరువాతి చరిత్రము నుండును. ఒకడు పూర్వకర్మమునుండి సంపూర్ణముగనో లేక కొంచము కొంచముగనో విడుదలనొందుటయో లేక పూర్వముండిన బంధమున కింకనుచేర్చి యధికబాధము లేర్పరుచుకొనుటయో, ఈజన్మమున నతడెట్లు నడచుకొనుచున్నాడో దాని ననుసరించియుండును.

భగవంతుని యనుగ్రహమువలన నెట్టి బంధమునుండియు జీవుడు విడుదలను బొందవచ్చును. ఆ యనుగ్రహ

మును సంపాదింప జీవుడు చేయవలసిన ప్రయత్నములు కర్మ విధిప్రకారము, పూర్వకర్మబంధమును త్రెంచివేయు పుణ్య కర్మములగును. భగవంతుని దివ్యానుగ్రహము బడయుటకు మార్గము గీతయందు చెప్పబడియున్నది. దీనికే యోగమని పేరు.

గీతలో చెప్పబడిన యోగమునందలి యంగము లేవియన:-

(1) ఇంద్రియములను అరికట్టుట, శుద్ధమైన జీవనము, చక్కని యాచారము అనగా ఉపాసన, కర్మము, ఆహారము, విహారము, నిద్ర మొదలగువానియందు నియమము.

(2) స్వభావమువలననో, సంఘమునందు తాను పొందిన స్థానమువలననో, సందర్భమువలననో, తనకేర్పడ్డ పనులను స్వలాభమును కోరక, సంఘమును విడువక యంతయును లోపములేక చేయుట.

(3) జయాపజయములను సమబుద్ధితో ననుభవించుట, కష్టములనుచూచి మనస్సున కలతనొందక, దుఃఖములు, క్లేశములున్నను, ధైర్యమును శాంతినివిడువక మనస్సును సమత్వమునకు తెచ్చికొనుట.

(4) మనస్సును ఎడతెగక కాచికొని, కామము, క్రోధము, ఆశ, అను ఉద్రేకములకు ఎడమివ్వకుండుట.

(5) ఇట్లు లోపలను, బయటను శుద్ధముచేసుకొని,

మనస్సును స్థిరపరచుకొని, యెప్పుడప్పు డధ్యాత్మధ్యానము చేయుట.

(6) భగవంతుని సంపూర్ణముగ శరణుజొచ్చుట.

పై చెప్పబడిన యోగములలో నొక్కొక్కదానిని ప్రత్యేకముగ పేరుచెప్పి క్రమముగ చెప్పవలసిన యెడల, వానిని సాంఖ్యయోగము, కర్మయోగము, జ్ఞానయోగము, సన్యాసయోగము, అధ్యాత్మయోగము, భక్తియోగము అని అనేకవిధములుగ చెప్పవచ్చును. కాని నిజముగ నభ్యాసముచేయు క్రమమున నివన్నియు నొకదానిలో నొకటి కలిసి యుండును. ఒకటిగా దానిని పొందవీలులేదు. కావున గీతయందీక్రమముల నెల్ల నొక్కటిగ గూర్చి యేకముఖముగ భగవంతు డుపదేశించి యున్నాడు.

భక్తితోడను, శ్రద్ధతోడను, దీనిని చదువువారిలో కొందరికి తుదకొక సందేహము తోచవచ్చును. గీతలోచెప్పి యున్నదంతయు సరియే. కాని సాధారణమనుష్యుల కది యుపయోగపడునా? దీనిలో చూపబడిన లక్ష్యములన్నిటిని పొందుశక్తిమనకు లేదుగదా! ఇది మనకెట్లు ప్రాప్తమగును? మహాత్ములకు మాత్రము దీనిలో చెప్పబడినది సాధ్యము. అని ఈరీతిగా నాక్షేపణ తోచవచ్చును.

కృష్ణుడు చూపించిన దారిమాత్రమే కాదు, లోకములో జనులనుసరించు నెల్లమతములును, మార్గములును, "నీ

యాక్షేపణ కెడమిచ్చును. ఏయుత్తమ మతమునం దైనను, యేధర్మగ్రంథమున చెప్పబడిన జీవనక్రమమైనను లోపము లేక పూర్తిగ ననుసరించుట కందరికిని సాధ్యము కాదు. ఉదాహరణమునకు, ఏసుక్రీస్తునుపదేశములను తీసుకొందము. అతడు నడచి చూపినద్వారియు, చేసినయుపదేశములును సంపూర్ణముగనాచరణములోనికి తెచ్చుటయెల్లరకుసాధ్యమగునా? కాని, వారిమార్గమునుబట్టి పోవువారికి దానివలన ప్రయోజనములేదా? ఎందరో జనులనదికాపాడి ఉద్ధరించినది. మహాత్ములకుమాత్రమేకాదు, పామరులకుకూడ, దేహమున కాహారము యెట్లో యట్లే యంతరాత్మకుగల యాకలిని తృప్తినొందించునాహారమై, యాయుపదేశ ముపయోగపడుచు వచ్చినది. అట్లే యెల్లమార్గములును. అట్లే గీతయును.

చేతితో దీపమును బట్టుకొనిపోవునప్పుడు మనకీడయే దారి కడ్డమువచ్చును. చెట్టును, పొదయు, వెలుగున కడ్డు పెట్టును. కాని ఇది వెలుగుదోషము కాదు. దీప ముపయోగింపకయు పోలేదు. పాపము, కష్టము, సందేహము, ఆశ, మనోద్వేగము ఇవి యడ్డముగ వచ్చినను, గీతయం దుపదేశింపబడిన లక్ష్యములను ముందుంచుకొని, మనము నడచిన యెడల చీకటినిదాటి కృతార్థులము కావచ్చును. ఒక్కొక్కడు నంతటిని చేయసాధ్యము కాకున్నను, అందరు నొక్కటే

జీవితలక్ష్యమునుబట్టి నడచుటవలన నందరి జీవనక్రమము నేకభావమునొంది, యందరి సంఘజీవనమునందును, సుఖము నెలకొనును.

సాధారణముగా దేహారోగ్యమునకు, సుఖాధారముగ చెప్పిన పథ్యములనుగూడ నందరును దోషముకాని లోపము గాని లేకుండ సంపూర్ణముగ ననుసరింప సాధ్యముకాదు. కాని, లోపములతో గూడియున్నను, ఆరోగ్య శాస్త్రోప దేశముచేత నెక్కువ ప్రయోజనముండునని మనము చూచు చున్నాము. దేహారోగ్యముకంటెను నాత్మసుఖమును సంపా దించుట కఠినముకదా? దానికై యుపదేశించియున్న పద్ధ తులు కఠినముగనే యుండును. అందరును వానిని లోప ములులేక యనుసరించుట యసాధ్యముగనే యుండును. కాని యుపదేశము ప్రయోజనకారి కాకపోదు. ఉత్తమలక్ష్యములు, మనుష్యుని జీవనములు, హితసాధకములై యున్నవి. సంపూ ర్ణముగ నొందసాధ్యముకాదని, ధర్మప్రకాశము నార్పివైచి, చీకటియం దుండగూడదు. గీతలోనే భగవంతుడు చెప్పి యున్నాడు.

నేహాభిక్రమనాశో ఽస్తి ప్రత్యవాయోన విద్యతే
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.

ఈరీతిగ చేసిన ప్రయత్నమున కంతటికిని ప్రయోజనము మున్నది. నష్టములేదు. పథ్యముచేయక సేవించిన ఔషధము వలె కాదు. లోపదోషము లుండుటవలన, నేయపాయమును కలుగదు. ఈధర్మమును కొంచెమే యాచరించినను, సంసారమను గొప్పభయమునుండి రక్షించుకొనవచ్చును. 2-40.

సమాప్తము.

శ్రీకృష్ణార్పణము.



ఓం నమో నారాయణాయ

8. 4. 1984.

# అనుబంధము 1.

## గీత: విశ్వమాత.

(గాంధి మహాత్ముడు.)

(గాంధిమహాత్ముడు కాశిలో విద్యార్థులకు హిందీభాషలో నిచ్చినయుపన్యాసమున కీక్రింది దనువాదము.)

జీవితములో కలుగుకష్టములనుండియు, మోహములనుండియు తప్పించి సరియైనదారిచూపగల యొక మతగ్రంథముండుట యావశ్యకమని నాకుచిన్నతనములోనే తోచినది. వేదములను చదువుదమన్న కాశివంటి విద్యాస్థానములో పదునేను పదునాఱు సంవత్సరములైనను చాలకష్టపడవలెను. అప్పుడు నాకు వేదాభ్యాసము చేయుట కవకాశము చిక్కక పోయినది. కాబట్టి వేదములు నాకందరానివయినవి. కాని సమస్తశాస్త్రములు, ఉపనిషత్తులలోని సారమంతయుగీతలో నేడువందలశ్లోకములలో నిమిడియున్నదని నేనెక్కడనోచదివియుంటిని. వెంటనే నిశ్చయము చేసికొంటిని. గీతను చదువుటకు ముందుగా సంస్కృతమును నేర్చుకొంటిని. నేడు గీత నాకు బైబిలు, ఖురానులవంటిది మాత్రము కాదు:— అది అంతకంటె ఉత్తమమైనది, అది నాకు తల్లి. నాకు దేహ

మును ప్రసాదించిన తల్లి నాచిన్ననాడే గతించినది. కాని నాటినుండియు నీశాశ్వతమాత యామె లేనికొరతను సంపూర్ణముగా తొలగించి నాకండయై నిలిచినది. ఆమె ఎన్నడును మారలేదు. ఎన్నడును నాకు బాసటయై నిలువకయుండలేదు. కష్టములును, దుఃఖములును సంప్రాప్తించినప్పుడామె హృదయములో తలదాచుకొందును.

సాధారణజనులకు గీత చాల కష్టమైన గ్రంథమని యప్పుడప్పుడు వినుచుందుము. ఈ యాక్షేపణ నిరాధారమైనదని నాయభిప్రాయము. అఖండపాండిత్యమును సంపాదించిన కీర్తిశేషుడైన లోకమాన్యుడు గీతపై గొప్ప వివరణమును వ్రాసినాడు. అది యతనికి తన శేముషి నుపయోగించి గొప్ప సత్యములను గ్రహించుటకొరకు నిధానముగ నుండినది. అట్లని సాధారణమనుష్యుడు భయపడనక్కరలేదు. గీతలోని పదునెనిమిది యధ్యాయములను జదివి బోధపరుచుకొనుట నీకు కష్టమని తోచినయెడల దానిలోని మొదటి మూడధ్యాయములను మాత్రమే శ్రద్ధగ చదువవచ్చును. తక్కిన పదునేనధ్యాయములలోను వేర్వేరు దృక్పథములనుండి వివరముగా దెలుపబడినదంతయు సంగ్రహముగా నీ మూడధ్యాయములలో నిమిడియున్నది.

ఈ మూడధ్యాయములలోని ముఖ్యాంశము కూడ అక్కడక్కడ కొన్నిశ్లోకములలోమాత్రమే యర్థమంతయు

నణగియున్నది. ఇదిగాక గీతలో మూడు ప్రత్యేకస్థలములలో వివిధ మతబోధనలను విడిచి భగవంతునే శరణు చొరవలె నని యుద్బోధ చేయుచున్నది. ఇందువలన గీతలో సూక్ష్మార్థము లున్నవనియు నర్థబోధ చాల చిక్కులతో కూడియున్నదనియు చేయు నాక్షేపణ కేవలము నిరాధార మైనదని తెలియగలదు.

గీత విశ్వమాత. ఆమె యెవ్వరిని దూరముగ నుంచు మనదు. కోరినవారి కాద్వారము బాగుగ తెరచియేఉన్నది. గీతను మనసా నాశ్రయించిన వాని కాశాభంగ మనునది లేదు. అత డూహింపరాని శాశ్వతానందమును శాంతిని అనుభవించును. సందేహపరునకును జ్ఞానపాండిత్యము గలవానికిని నాశాంతియు, నాయానందమును గలుగవు. అనన్య చిత్తులై, శ్రద్ధాపూర్ణులై, వినయసంపన్ను లైనవారికే యావి యబ్బును. అట్టి శ్రద్ధాభక్తివినయములతో గీత నారాధించిన వాడెవ్వడు నెన్నడును విఫలమనోరథుడు కాలేదు.

మనవిద్యార్థులు సాధారణముగా స్వల్పవిషయముల చేతనే కలత నొందుదురు. పరీక్షలో కృతార్థత కలుగలేదను చిన్నవిషయమునే వారమితమైన నిరాశను పొందుదురు. కంటికపజయముగ తోచినదానిని లక్ష్యపెట్టక వారు ప్రయత్నమును విడనాడకుండవలెనని గీత వారికి ధర్మబోధ చేయు

పై మన కధికారము లేదనియు, జయాపజయములు రెండును నొక్కటే యనియు నది బోధించుచున్నది. మన దేహమును మనస్సును నాత్మను మనధర్మమును నిర్వహించుటకు సంపూర్ణముగా వినియోగింపవలె ననియు, యదృచ్ఛాకామసంతృప్తులముకాగూడదనియు' మనకోరికలను మనయధీనములో నుంచుకొనవలెననియు నది మనలను హెచ్చరించు చున్నది. సత్యాగ్రహినైన నాకది నిరంతరమును క్రొత్త పాఠములను నేర్పుచున్నదని చెప్పగలను. నేను భ్రమకు లోనై యున్నానని యెవరైన నాతో చెప్పినయెడల ఈభ్రమనే నాపరమనిధానముగా భద్రపరచుకొందునని వారికి బదులుచెప్పుదును.

విద్యార్థులు తమ ప్రాతఃకాలకృత్యములను గీతాపఠనముతో నారంభింపవలెనని నేనుపదేశించుచున్నాను. నాకు తులసీదాసు ప్రియుడు. నే నతని భక్తుడను. కష్టసంకులమైన ప్రపంచమునకు రామనామమను మంత్రమును ప్రసాదించిన యామహాత్ముని నేను పూజించుచున్నాను. కాని, నేడు మీకు తులసీదాసునిగురించి చెప్పుటకు రాలేదు; మీరు గీత నభ్యసింపవలసినదని చెప్పుటకు వచ్చినాను. దానిలోని దోషములను కనుగొనవలెనని విమర్శదృష్టితో దానిని మీరు చదువకూడదు. దానిని భక్తితోను, శ్రద్ధతోను చదువవలెను. అట్లభ్యసించినయెడల నది మీకోరికలనన్నిటి నీడేర్పకలదు. ఆమధురామృతము నొకసారి రుచిచూచినయెడల, దినదిన

మనకును మీకు దానిమీద మక్కువ యెక్కువ కాగలదు. గీతాశ్లోకపఠనము కష్టములలో మీ కాధారము కాగలదు, దుఃఖములోను, ఏకాంతకారాగారవాసములోనుగూడ, మి మ్మోదార్పగలదు. ఈశ్వరాజ్ఞయై ప్రాణములను విడువవలసి నప్పు డీ గీతాశ్లోకములను పెదవులతో స్మరించుచు విడిచిన యెడల బ్రహ్మనిర్వాణము సిద్ధింపగలదు. ఆ బ్రహ్మనిర్వాణ మన నేమో మీ యాచార్యులువారు బోధింపగలరు.

---

## అనుబంధము 2.

## గీత: దివ్యఫలము.

(లోకమాన్య బాలగంగాధరతిలకు).

ప్రపంచవాఙ్మయమంతటిలోను గీతవంటి గ్రంథము లేదు. మిక్కిలి యుత్తమకాంతిగల వెలలేని రత్నము. అది దుఃఖాత్ములకు శాంతినిచ్చును; మనల నధ్యాత్మ విద్యా సంపన్నులను జేయును. వేయేల? సనాతన కాలగర్భమున నడగియున్న సత్యములను మనకు తెలుపగల గ్రంథ మొక్క గీత తప్ప, ప్రపంచభాషలలో దేనిలోను మరియొకటిలేదు.

గీత మనకు బ్రహ్మానందమును కలిగించును. అది జాతి, వర్ణ, లింగ, దేశభేదములను చేయదు. ఇతరమతగ్రంథముల యెడల నది సహనబుద్ధిని కలిగించును. కర్మ, భక్తి, జ్ఞాన యోగములకు దానిలో చక్కని సమన్వయము కలదు. అది సనాతన వైదిక ధర్మవృక్షమున పండిన ఫలమని సులభముగ చెప్పవచ్చును.

ఇది హిందూమతమూల తత్త్వములను స్పష్టముగ బోధించుచున్నది. కాబట్టి హిందూమత ప్రధానలక్షణములను దెలియ నాసక్తిగలవారీ ఉత్తమోత్తమమును, నద్భుతమునైన గ్రంథమును తప్పక చదువవలెను. నశ్వరము, అనశ్వరము; క్షేత్రము, క్షేత్రజ్ఞుడు; అనువానినిగూర్చి యోగ, సాంఖ్య, న్యాయ, మీమాంసా, వేదాంతశాస్త్రములలో వేదానుసారముగ వివరింపబడియున్నది. అజ్ఞానమంతయు గీతలో జ్ఞాన, భక్తి సంవర్ధితమయిన కర్మసిద్ధాంత మను పేర నుపదేశింపబడినది. కాబట్టి, సంస్కృత వాఙ్మయములోకూడ నంత సమగ్రముగను స్పష్టముగను హిందూధర్మ తత్త్వము ప్రతిపాదింపబడిన గ్రంథము లేదని చెప్పవచ్చును.

---

